శృంగారగ్రంథమాల:— ౩.

# శృంగార
# అహల్యాసంక్రందనము

సముఖము
వేంకట కృష్ణప్పనాయక మహాకవి
విరచితము

ప్రకాశకులు:
జి. యస్. శాస్త్రి అండు కో.,
మద్రాసు



—

సర్వస్వామ్యసంకలితము



ప్రథమ ముద్రణము

లండన్ రాయల్ మెడిషన్

వెల రు. 2-0-0



చెన్నపురి:

సమదర్శిని ముద్రాలయమున

ముద్రితము—1927.

# పీఠిక

---

పదునాఱు పదునేడు శతాబ్దములలో, దక్షిణాంధ్రదేశమున వెలసిన రసవత్ప్రబంధములలో నహల్యా సంక్రందన మొకటి. దీనికి

## కృతికర్త

సముఖము వేంకటకృష్ణప్ప నాయకుఁడు; చతుర్థకుల సంజాతుఁడు. ఇతని తల్లిదండ్రులు అలమేలమ్మా మీనాక్షినాయకులు పరంపరగా వీరివంశమువారు మధురనాయక రాజులయొద్దఁ బ్రధానులుగా నుండెడివారు. ఈకవి ప్రఖ్యాతుఁడగు విజయరంగ చొక్కనాథ నాయకునికి (క్రీ శ 1704—1731) 'అంతరంగిక సామాజికుఁడు' (మంత్రి) గ నుండినటును, అతనివలన 'గజతురంగమాందోళికా ఛత్రిచామర విజయ కాహళభూంఖేరబిరుదధ్వజప్రము' ఖాదులను బడసినట్లును గ్రంథావతరణికవలనను, ఆశ్వాసాంత గద్యములవలనను స్పష్టమగుచున్నది. మఱియు నీతఁడు విజయరంగ చొక్కనాథనాయకునిపక్షమున సేనాపతియై తంజావూరి రాజగు విజయరాఘవనాయకునిపై దండువెడలి సంగరరంగమున నాతని సపరివారముగఁ జంపి విజయము గాంచెననియు, ఇతనికి,

'సంగరసవ్యసాచి' 'సంగరకిరీటి' అను బిరుదము లుండెననియు [1]తంజావూరు ఆంధ్రరాజులచరిత్రమునఁ గలదు. తారాశశాంకవిజయమును రచియించిన శేషము వేంకటపతికవియు, బుఱిగె కృష్ణ కవియుఁ దన కాప్తమిత్రులనియు, వారే తనవంశావతారక్రమము నింపున్నట్లు వర్ణించిరనియు నీతఁ డిందుఁ జెప్పికొన్నాఁడు. దీనినిఁ గవి కస్తురిరంగని (శ్రీరంగనాథస్వామి) కంకితము చేసినాఁడు.

## ఇతని యితరకృతులు

[2] ఇతఁడు జైమిని భారతమును వచన కావ్యముగను, సారంగధర చరిత్రమును మూఁడాశ్వాసముల ప్రబంధముగను, [3] రాధికాసాంత్వనము నేకాశ్వాస ప్రబంధముగను రచియించినాఁడు.

## అహల్యాసంక్రందనవిలాసము

భర్తృహరి "దాక్షిణాత్యకవయః" అని చేసిన ప్రశంస సంస్కృత కవులకే కాక తెలుఁగుఁ గవులకును జెల్లినది. రస

---

1. బ్ర. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ప్రకటించిన ప్రతి, పే. ౨౭—౩౭

2. దీనిని ఆంధ్రసాహిత్య పరిషత్తువారు ప్రకటించినారు.

3. చెన్నపుర ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున వ్రాఁత ప్రతిగలదు.

వంతములగు దక్షిణాంధ్ర కృతులలోఁ 'చేమకూరపాకము' సా
రస్యభరితమని పేరెన్నికఁ గన్నది. పలువు రాపాకము నను
కరింపఁ బూనిరి, చేమకూర వేంకటకవికిఁ బిదపఁ గొలఁది కాల
మునకే వెలసిన యీ వేంకటకృష్ణప్పనాయఁకుఁడును, దన
యహల్యాసంక్రందనవిలాసమును, విజయవిలాసమును మేలు
బంతిగాఁ బెట్టుకొని రచియించినాఁడు. విజయవిలాస
పద్యములకుఁ బ్రతిపద్యము లనఁదగిన పద్యము లిందుఁ
బెక్కులు గలవు.

విజయరంగచొక్కనాథుఁడు శృంగార ప్రియుఁడౌటచేత
నేమో తదాస్థానకవు లెల్లరుఁ శృంగారప్రబంధములనే రచి
యించిరి. కామేశ్వరకవి సత్యభామాసాంత్వనము, వేంకటపతి
తారాశశాంకవిజయము, ఈతని యీ కృతి మొదలగునవి,
యిందుకుఁ దార్కాణములు.

శృంగారకథలలో నహల్యాసంక్రందనుల కథ, రం
భానలకూబరులకథ, తారాశశాంకులకథ, రాధామాధవులకథ
సుప్రఖ్యాతములు. పరకీయా శృంగారమగుటచే నవి మఱియు
రసోద్దీప్తిగల వగుచున్నవి. రసికులగు కవుల వశమై యా
కథలు మఱియు రక్తి కెక్కినవి. వేంకటకృష్ణప్పనాయఁకుఁ డిందు
శృంగారరసమును నిపుణముగా నెలకొల్పినాఁడు. ఘృత
శర్కరలువోలె హాస్యశృంగారములుగలసి యాస్వాద్యముల
గుట నీకవి గుర్తించి యీకృతిలోఁ బ్రథమాశ్వాసమున హాస్య

రసమును, విదపశృంగారరసమును జాతుర్యముతో సంధానించి నాఁడు. పౌరాణికములయిన ప్రాఁతకథలయెడ ధర్మశాస్త్రచర్చ కంతగాఁ దావుండదు. కథా ధర్మతత్త్వవిచారణ మిక్కడ కావించుట నిరర్థకము. అయినను గవి యిందు నింద్రుఁ డహల్యపై ననురక్తుఁడగుటకుఁ గల ధర్మరహస్యమును దెలిపి కథను గొంత కాపాడినాఁడు.

విజయవిలాసమునకుఁ గొంత వెనుకఁబడినను ఈగ్రంథము శబ్దాలంకారబహుళమై ధారాశుద్ధిగలదై రసభరితమై యున్నది. కవికుమారుల కిది కంఠాభరణమై వెలయఁగలదు

ప్రాచీనకవులెంతో శ్రమపడి పండితమండలికి నాహ్లాదము గలుగునట్టు రచియించిన ప్రౌఢప్రబంధము లెన్నో ప్రాఁతతాటియాకులపైఁ జివికి జీర్ణించుచున్నవి. అట్టివానిని జక్కఁగా నచ్చొత్తించి కవిహృదయమును గాపాడఁ బ్రయత్నించుచున్న మా కాంధ్రభాషాభిమానులందరై యింకను నిట్టి రసవత్ప్రబంధములను బ్రకటింపఁ జేయూఁత యొసఁగుదురు గాక యని యాసించుచున్నాము.

| ప్రభవ జ్యేష్ఠశుద్ధపూర్ణిమా సౌమ్యవారము | గంటిసూర్యనారాయణశాస్త్రి<br>సంపాదకుఁడు. |
|---|---|

శ్రీ

# శృంగారాహల్యాసంక్రందనము

## ప్రథమాశ్వాసము

శ్రీ సొబగొందు నిందుసర
సీసరసీరుహకేసర ద్యుతిన్
వీసరవోక మీసరపు
నిగ్గుల జగ్గుల దుప్పటిన్ దటి
ద్భాసితనీలమేఘమన
భాసిలు రంగనివాసుఁ గౌస్తుభో
ల్లాసు రమాధివాసు సవి
లాసమతిన్ నిరతిన్ నుతించెదన్.

ఉ. రంగమహీశుకొమ్మ జిగి
రంగులబంగరుబొమ్మ సంపదల్
పొంగుచు నిచ్చు గుమ్మ పతి
యొ మ్మెడఁబాయని ముద్దుగుమ్మ య

య్యంగజుఁ గన్నయమ్మ శర
 ణార్థికి వేలుపు ప్రమానికొమ్మ నె
మ్మిం గరుణించి యిచ్చు నెల
 మిన్ గలిమిన్ బలిమిన్ దిరంబుగన్.

ఉ. బంగరుగట్టు సింగిణియుఁ
 బంకజలోచన దివ్యబాణముం
రంగుగఁ దాల్చి ప్రేల్మిడిఁ బు
 రంబులు ద్రుంచి జగంబుఁ బ్రోచు ప్రాక్
జంగము క్షీరవారిధిని
 షంగము భక్తజనావనక్రియా
చంగముఁ గీర్తిరంగ మల
 సౌందరలింగము నాశ్రయించెదన్.

చ. కరమునఁ జిల్కఁ బల్కఁ జిగి
 కమ్మలు చెక్కులఁ గుల్కఁ గన్నులన్
వరకృప చిల్క మోవిఁ జిఱు
 నవ్వుల వెన్నెల దొల్క ధాత్రికిన్
వరమొసఁగన్ గదంబ వన
 వాటిఁ జెలంగెడి మేటి సుందరే

శ్వరుని వధూటిఁ గొల్తుఁ గృత
బంధవిమోచనఁ బద్మలోచనన్.

ఉ. అంబ జగత్త్రియంబును ద
యం బరిపాలనచేయు సద్గుణా
లంబ సహాసకోమల క
ళాలలితాననచంద్రబింబ హే
రంబుని గన్నయంబ సుర
రత్నసమాధరబింబ మాకు ని
త్యం బఖిలాండనాయిక జ
యం బనయంబు నొసంగుఁ గావుతన్.

ఉ. ప్రాంచిత వేదనాదము స
మంచితమున్ నలుమోములన్ మరుత్
ప్రాంచిత కాంచనాచల గు
హాంచలతన్ రహిమించ నీరుఁబాల్
పంచు గురాని వేడ్క మిగు
లన్ నడిపించు విరించి నెంచి భా
వించి నమస్కరించెద స
మీహితసాహితి సేకరించఁగన్.

ఉ. సారతరంగణీ కనక
సారసరాజమరాళి కైవడిఁ
హారి హిరణ్యగర్భ వద
నాంతరసీమ వసించువాణి శృం
గార సరోజపాణి నవ
కంధరవేణి విలాసధోరణిఁ
వారక నిచ్చ నిచ్చలు ని
వాసముచేయు మదీయజిహ్వకన్

చ. కుడుములు చాల మెక్కి కలు
గుంబలులాయపుఁడేజి నెక్కి ప్రా
ఁడుదువుల వన్నె కెక్కి మహి
నూల్కొను విఘ్నములెల్లఁ జెక్కి య
య్యుడుపతి మౌళిపాదముల
కున్నత భక్తిని మ్రొక్కి భక్తులన్
విడువక ప్రోచు భవ్యమతి
విఘ్నపతిన్ సుమతిన్ భజించెదన్.

సీ. రామకథా సుధారసములు వెదచల్లు
సర్వజ్ఞు వాల్మీకి సన్నుతించి

బహువేదశాఖలఁ బల్లవింపఁగఁ జేయు
భారతకవి వ్యాసుఁ బ్రస్తుతించి
నవరసవర్షణానంద హేతువులైన
కాళిదాసాదుల గణనచేసి
తెనుఁగున భారతం బొనరించి మించు న
న్నయఁ దిక్కమఖి నెఱ్ఱనం దలంచి
ఇలను సకలరహస్యముల్ దెలుపఁజాలు
భాస్కరుని సోము నెంతయుఁ బ్రస్తుతించి
అర్థి ఘనమార్గదర్శనులైన కవుల
సంతతంబును మన్మానసమున నెంతు.

ఉ. షండున కేల రంభ; కడు
జారున కేల కులప్రచింత; పా
షండున కేల సాధుజన
సంగతి; కష్ట నికృష్ట లోభియా
చండికి నేల నిర్మల య
శంబులు; వేశ్యకు నేల సిగ్గు; దు
ష్పండితుఁడైన వానికిని
సత్కవితారసగోష్ఠి యేటికిన్.

వ. ఇవ్విధంబున నిష్టదేవతావందనంబును సు
కవిజనానందనంబును, గుకవినిందనంబునుం
గావించి సకలకలికలుషతిమిరభాస్కరో
దయంబును, నుల్లసితసంపత్పల్లవ వాసంతికా
వాసంబును, నవరసనిగూఢగంభీరంబునుంగా
నెద్దియేనియు నొక్కమహాప్రబంధంబు
రచియింపఁ బూనియున్నయప్పుడొక్కనాఁటి
ప్రభాతకాలంబున:

ఉ. కస్తురిబొట్టు నెన్నుదుటఁ
 గౌస్తుభరత్నము పేరురంబునన్
బ్రస్తుత శంఖచక్రములు
 బాహువులన్ నతనాభిఁ దమ్మియున్
సిస్తుగ నొప్పు భూసతియు
 శ్రీసతియున్ దనుఁజేరి కొల్వఁగాఁ
గస్తురిరంగసామి కలఁ
 గానఁబడెన్ గరుణాతిభూమియై

వ. ఇవ్విధంబునం గనుపట్టిన యద్దేవునింగాంచి
సముంచిత వినయసంభ్రమంబులు మనంబునం

బెనంగొనఁ బులకితగాత్రుండనై సాష్టాంగ దండప్రణామం బాచరించి కరకమలపుటంబు నిటలతటంబున ఘటియించి యానందభరితుండనై యుండ నన్నుఁ గనుంగొని యద్దేవుండు గంభీరమధురభాషణంబుల నిట్లనియె.

గీ. సముఖమీనాక్షినృపగర్భ విమలజలధి
చంద్ర వేంకటకృష్ణేంద్ర, శౌర్యసాంద్ర,
మునుపు జైమిని భారత మనఁగ వచన
కావ్య మొనరించినట్టి సత్కవివి గావె.

శా. వాసిన్ రంగవిభుండు నేను, ధరణిన్
వాక్ప్రౌఢిమన్ నీ వహ
ల్యాసంక్రందన మన్ ప్రబంధము రసో
ల్లాసంబుగాఁ జేయ బే
రాసం గోరి వినంగ వచ్చితిఁ బ్రియం
బౌనట్లు నాపేరిటన్
భాసిల్లం దగ సంకితంబు నొసగూ
ర్పన్ నీకు మేలౌ నికన్.

వ. అనియానతిచ్చుటయు ను దోడన మేలుకాంచి మేలుకాంచినహృదయంబున నుదయంబునఁ గాల్యకరణీయంబులు నిర్వర్తించి యంత దం దడిమెఱయఁ బురోహిత భృత్యామాత్య సా మాజికబంధువర్గంబులు గొలువం గూర్చుండి యుభయభాషాకవితా విశేషులైన శేషము వేం కటపతి,బుణిగెకృష్ణకవీంద్రుఁడు నాకాప్తసఖులు గావునఁ వారింబిలిపించి యీశుభస్వప్నంబు వినిపించుటయు వారలు సంతోషభరితాంత రంగులై శ్రీరంగ వల్లభుండు శ్రీభూమీసమే తుండై నీకుం గనుపట్టెంగావున నితోధిక ధనధాన్య కరితురగ భటకదంబకాది నానావి ధసంపదలును, బహుగ్రామభూములునుం గలు గు; సప్తసంతానంబులలో నతిశ్లాఘ్యంబైన ప్రబంధసంతానంబు నిర్మింపు మనియెం గావున శీఘ్రంబె మీతండ్రికి నీవు జనియించినచందం బున సకలగుణాధారులైన కుమారులు నీకుం గలుగుదురు; స్వామిహితకార్యఘటనాధుర్యం

డవు, బంధుజనపోషకుండవు, శ్రీరంగపతిపదార
విందమిళిందాయమానమానసుండవుం గావున
నీ కిట్టిశుభస్వప్నంబు గలిగె; భవదీయవంశావ
తారక్రమంబు వర్ణించెద మాకర్ణింపుమని యి
ట్లనిరి:

క. శరణంబులు జగముల కా
భరణంబులు వేదములకుఁ బంకజలక్ష్మీ
కరణంబులు నారాయణ
చరణంబులు నెసఁగు శూద్రజాతికి నిరవై.

క. నాలవవర్ణం బనియెడి
పాలసముద్రంబునందు భావుకలక్ష్మీ
లోలుఁడు లోకావనకరు
ణాశీలుఁడు కేశవప్పనాయఁడు వెలసెన్

ఉ. ఇంద్రుఁడు భోగసంపద, ను
పేంద్రుఁడు రూపముచేత, నాహరి
శ్చంద్రుఁడు సత్యవాక్యమునఁ,
జంద్రుఁడు కాంతినిరూఢి, చాపని

స్తంద్రత రామచంద్రుఁడు, ల
సన్మతిచాతురిచేత శేషభో
గీంద్రుఁడె యంచు భూమిజను
లెన్నఁగఁ గేశవనాయఁ డొప్పగుఁ.

క. ఆకేశవనాయనికి
రాకేశవదాతకీర్తి రాజితపుణ్య
శ్లోకుఁడు వేంకటనాయఁడు
శ్రీకాంతున కబ్జభవునిచెలువునఁ గలిగె.

ఉ. చందురు బొమ్మ మెట్టి యర
చందురుతాలుపు నట్టుగిట్టి యా
నందిని ముక్కుగుట్టె సుర
నాయకదంతిని జెక్కుగొట్టె య
స్పందితలీల సీరి యొడిఁ
బట్టి చెలంగుచుఁ గీర్తి వీనులకు
విందొనరించు నార్యులకు
వేంకటనాయఁడు భూపమాత్రుఁడే.

క. పెదగురువపనాయఁడు త
త్పదమలమూర్తికిని బుట్టె శాశ్వతకీర్తిక

గుదురై యీవిని జదురై
యెదురైన విరోధినృపులనెల్ల జయించెన్.

క. అతనికిఁ గలిగెను బాదా
నతశాత్రవుఁ డెల్లిసెట్టినాయఁడు రేఖా
రతిపతి భాషావాచ
స్పతి భోగానుభవమున దివస్పతి యనఁగన్.

క. శంకరకైంకర్యపరుం
డంకభయంకరుఁడు గల్గె నతనికి నుర్వీ
సంకటహరసాయకుఁడగు
వేంకటనాయకుఁడు భువనవిశ్రుతయశుఁడై.

సీ. ధన్యుఁడై నృపతిమూర్ధన్యుఁడై నిర్ఘాత
  దైన్యుఁడై నృపసంఘమాన్యుఁ డగుచు
గేయుఁడై సుజనాళిగేయుఁడై దానరా
  ధేయుఁడై విద్వద్విధేయుఁడగుచు
ధీరుఁడై కనకాద్రిధీరుఁడై కదనహం
  వీరుఁడై సద్గుణహారుఁ డగుచు
శీలుఁడై హరిభక్తిశీలుఁడై సంగీత
  లోలుఁడై కవిబృందపాలుఁ డగుచు

సకలబాంధవసంతోషి సత్యభాషి
స్వామిహితకారి స్వజనరక్షణవిహారి
వెలయు బహుసంపదలచేత విబుధభాగ్య
దాయకుండైన వేంకటనాయకుండు.

క. ఆనరపతి వేంకట మా
మానినిఁ బెండ్లాడి వరకుమారునిఁ బడయన్
దానతపోధ్యానాదు ల
నూనగతిన్ బెద్దకాల మొనరించుతఱిన్.

క. భూనుతు లాదంపతులకు
మీనాక్షీసుందరేశ మృదుపదపద్మ
ధ్యానాక్షయవిభవుండగు
మీనాక్షయనృపతి గల్గె మేదురయశుఁడై.

సీ. మక్కువ మీఱంగఁ జొక్కనాథస్వామి
తనమహాలింగమధ్యంబు వెడలి
చంద్రరేఖాజటాశార్దూల చర్మాహి
డమరుత్రిశూలముల్ కొమరుమిగులఁ
గలలోనఁ గనుపట్టి కరుణాకటాక్షముల్
చెలఁగఁ గటాక్షించి చేరఁ బల్చి

కేలిశూలమ్ముఁ డాకేలఁ గైకొని హ స్త
మ స్తకసంయోగ మాచరించి
ఆయురారోగ్య పుత్రపౌత్రాభివృద్ధి
ధనకనకవస్తువాహనతతుల విమల
త త్త్వ విజ్ఞాన మొసఁగె నేధార్మికునకు
నతఁడు కేవలనృపుఁడె మీనాక్షివిభుఁడు.

సీ. కప్పుమీఱినకందిపప్పులకుప్పలు
రాజ్యంబు వెలసేయు నాజ్యములును
బహుపుణ్యఫల పరిపాకముల్ శాకముల్
నిచ్చమెచ్చుల నిచ్చుపచ్చడులును
విప్పడంబుల నొప్పు నప్పడంబులరాసు
లతిరసంబులు వడ లతిరసములు
చంద్రమండలసుప్రసన్నము లన్నముల్
ప్రతిసుధారసములు పాయసములు
వెలయమృష్టాన్నసత్రముల్ వెట్టె నేతు
బాట న (నె)ల్లూరు లోపలఁ దేటతీయ
నీటిమేటితటాకంబు నిధి యొనర్చె
మేదినీశ్వరమాత్రుఁడే మీనవిభుఁడు.

సీ. ఈలంపునీలంపు మేలికంబంబులు
కులశైలజాలంబు కొమరుఁదాల్ప
రంగారుబంగారు వ్రాఁతచిత్రంబులు
కిన్నరనరసురాకృతులు గాఁగ
నేతులజ్యోతులనెఱి దీపమాలికల్
తారకాగ్రహములదారి మీఱ
నెఱమట్టుకఱిపట్టు నిగ్గుచందువపొందు
ఘనఘనాఘనముల గరిమఁబూన
నిండుమెండున బ్రహ్మాండమండలంబు
రహి మహామంటపంబు సద్భక్తియుక్తి
సుందరేశ్వరుసన్నిధిఁ జందమొంద
నమరఁ గట్టించె సముఖమీనాక్షివిభుఁడు.

క. బంగారుబొమ్మయుం బలె
రంగారఁగ వన్నెవాసి రాణింపంగా
రంగగు నలమేలమయను
నంగన నాఘనుఁడు పెండ్లియై విలసిల్లెన్.

చ. కులమును శీలమున్ విభుని
కూర్మియు బాంధవపోషణంబు ని

శ్చలపతిభక్తి సత్యమును
జక్కఁదనంబును గల్గి యొప్పుచుం
జలధరనీలవేణి నవ
సారసపాణి మనోజ్ఞవాణి యా
మెలఁతలమేలుబంతి యల
మేలమయింతి చెలంగెఁ గీర్తులం.

సీ. పంకజాతము డించి పతిడెంద మలరించి
కలుముల వెదచల్లు కమలపాణి
వృత్తభేదములేక విభుసమ్ముఖాలోక
మాన్యమై పొలుపొందుమంజువాణి
వామవర్తన డించివరు నైక్యముఁజెంది
మహనీయయా సర్వమంగళాఖ్య
ఒకచాయఁ జేయక యొగి నాథుఁ బాయక
రాజద్గుణాఢ్యయా రమ్యసంజ్ఞ
యనుచుఁ బొగడఁగఁదగిన తొయ్యలులమిన్న
సరసవాగ్జితనవమాధ్వి పరమసాధ్వి
ఘనయశోవల్లి యాశ్రితకల్పవల్లి
మహితగుణపేటి యలమేలమావధూటి.

సీ. పలికెనా కపురంపుఁబలుకులరాసులు
ఘుమఘుమవాసించి కొమరుమించుఁ
గనువిచ్చిచూచెనా కలికల్వరేకుదొం
తరవసంతములసంతనలు మీఱుఁ
జిఱునవ్వునవ్వెనా నెఱచందమామ వె
న్నెలకన్న మిన్నవన్నెలు చెలంగు
కలికినెన్నడ ముద్దుగులికెనా రాయంచ
కొదమజొంపములసంపదలుపొదలు
సరససంగీతసత్కళాశారదాంబ
వినుతపాతివ్రతిఁ గుమారుఁ గనినయంబ
సకలజనమాన్య సాధురక్షణవదాన్య
వెలయు నలమేలమకు సాటి కలిమిబోటి

శా. ఆరామామణి మీనభూవిభుఁడు దా
మత్యంతభక్తిన్ సదా
శ్రీరాజిల్లఁగ వేంకటాచలపతిన్
శ్రీకృష్ణునిం గొల్వఁగా
వీరాగ్రేసర, నీవు గల్గితి జగ
ద్విఖ్యాతకీర్తి ప్రభల్

మీా అరా వేంకటకృష్ణభూపసుకృతీ,
లీలామనోజాకృతీ !

సీ. చిగురుజిరాకౌతుఁ జెనఁకుచక్కఁదనంబు
కదనంబు రిపులఁ బుల్గరవఁజేయుఁ
జే యుదన్వత్కర్ణశిబిదానశీలంబు
శీలంబు ధర్మదాక్షిణ్యశాలి
శాలిధాన్యసువర్ణసహితమ్ము భవనమ్ము
నమ్మువారికి నిధానమ్ము మాట
మాటఁజూచును ధైర్యమహిమ జాళ్వాగట్టు
గట్టురాయల్లునిఁ గదుముఁగడఁక
కడకనులయందె వసియించుఁ గమలవాస
వాసన పురారిమురవైరి భక్తిదొరలు
దొరలు నీసరి యగుదురె దరహాసముఖ
సముఖ వేంకటకృష్ణేంద్ర, శౌర్యసాంద్ర!

సీ. చదువఁగా నేర్తువు శారదాశారదా
జ్ఞానసానూపురార్భటుల ధాటిఁ
బాడఁగా నేర్తువు పండితాపండితా
కర్ణనానందసంఘటన పటిమఁ

బలుకఁగానేర్తువు భావజాభావజా
టాపగాటోపనిరర్గళోక్తిఁ
దగ వ్రాయనేర్తువు తారకాతారకా
నీకరేఖాసమానేకలిపుల
మెచ్చనేర్తువు కవితలమేల్మిఁ దెలిసి
యిత్తు వేనుఁగుపాఁడిగా నెలమిఁగవుల
కన్నిగుణములు నీయందె సమరె నౌర!
రిపుజయాధార వేంకటకృష్ణధీర!

ఉ. ఎంతయొయార మెంతసొగ
సెంతపరాక్రమ మెంతరాజసం
బెంతవిలాస మెంతనయ
మెంతవదాన్యత యెంతఠీవి మేల్
సంతతశౌర్యధాటి విల
సద్గుణపేటి కిరీటి వన్నిటన్
కంతుజయంతరూప కవి
కల్పక వేంకటకృష్ణభూవరా!

సీ. వింటివా నీవంటివింటివాని ధరిత్రిఁ
గంటి నే నల్లముక్కంటి నొకని

సారిగా నీ వాక్కసారి గాటపువీథి
దూరుచోఁ బొదలలోఁ దూరు రిపుఁడు
వింతమీఱంగ నీ వింత మీటినఁ దేజి
మంతుకృదైవ్వరిసామంతు నణఁచు
వేదండమెక్కి నీ వేదండ వచ్చినా
వే దిక్కుసొచ్చు దా వేది పరుఁడు
ఉన్నతోన్నతి నెన్నచో మిన్నపైనె
నిన్ను సన్నుతిసేయును బన్నగపతి
విమలచారిత్ర, మీసభూవిభునిపుత్ర
సముఖవేంకటకృష్ణేంద్ర, శౌర్యసాంద్ర!

సీ. ధైర్యమా శౌర్యమా దాక్షిణ్యమా పుణ్య
మా నయమా జయమా ప్రతాప
మా శుభరూపమా మహితవిజ్ఞానమా
దానమా భోగమా శ్రీనిరూఢ
యోగమా యాశ్రితవ్యూహసంరక్షణ
రాజద్విలాసమా రమ్యమంద
హాసమా మహితసౌహార్దస్వభావమా
భావమా భూరిప్రభావమాన్య,

నీకె తగునంచుఁ బాండ్యభూనేత విజయ
రంగచొక్కేంద్రుఁ డత్యంతరంగసబహు
మానసామాజికత్వ మిం పూన నొసఁగె
సముఖ వేంకటకృష్ణేంద్ర, శౌర్యసాంద్ర!

మ. నలనాసత్యవసంతులం గెలుచుసౌం
దర్యంబు ధైర్యంబు దో
ర్బలముం స్వామిహితానువృత్తి దయయుం
బ్రౌఢత్వముం విద్యయుం
వెలయం బాల్యమునందె నీవు మధురో
ర్వీనాథు మెప్పించవా
భళిరా, వేంకటకృష్ణభూవరమణీ,
భాషాఫణిగ్రామణీ!

క. అందముగ నహల్యాసం
క్రందనముం రచనసేయఁగా నేరుతువా
పొందుగ మధురిమ జగదా
నందము ఘటియింపు మనుచు నను నిట్లనఁగన్

వ. నేనును బ్రమోదభరితమానసుండనై.

షష్ఠ్యంతములు:

క. హారికి నవనవనీతా
హారికి సకలగుణరత్నహారికి మురసం

హారికి మందరధారికి
శ్రీస్మారరమణీమణిమనోనుసారికి హారికిన్

క. హాటకమయచేలునకున్
ఘోటకచటులప్రచార గుణశీలునకున్
పాటితరిపుజాలునకున్
నాటితనానాప్రపంచనటజాలునకున్.

క. చూడీకుడుత్త నాచ్చా
ర్చూడాసంబంధగంధి సుమసరధృతికిన్
క్రీడావల్లవపతికిన్
నీడజకులసార్వభౌమనిర్భరగతికిన్.

క. అభిసరణరమిత నిచుళా
ప్రభుకన్యామణికిఁ గైటభద్విపసృణికిన్
నభసదురస్థ్సలశుభకౌ
స్తుభవాసరమణికి దమితదుర్దమఫణికిన్.

క. శస్తునకున్ రక్షణకృత
హస్తునకున్! వాసవునకు నాత్మీయతనూ
విస్తారితభువనునకున్
కస్తూరీరంగపతికిఁ గరుణాకృతికిన్.

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన యహల్యా
సంక్రందనంబను మహాప్రబంధంబునకుఁ గథా
క్రమం బెట్టిదనిన:

శా. శ్రీరంజిల్ల నహల్య మౌనిసతియై
వృత్రారిపై మోహ మే
దారిం గూరిచెఁ దానఁ గల్గిన దురం
తంబైన శాపంబునన్
శ్రీరామాంఘ్రిరజంబు లెవ్విధము దీ
ర్చెన్ బల్కు మంచీసమా
చారంబున్ జనమేజయుం డడుగ నై
శంపాయనుండిట్లనన్.

మ. పదియార్వన్నియ రెక్కపక్కనొకరా
బాబావజీరుండు సాం
ద్రదయాంగీకృతయౌవరాజ్యభరతన్
రక్షింప లోకత్రయీ
విదితంబై యమరావతీపురము శో
భిల్లున్ వియద్వాహినీ

మృదువాతూల వినీత దివ్యయువతీ
క్రీడా పరిశ్రాంతివై.

చ. సురమణి ముద్దుమోవి సుధ
చొక్కపునవ్వు బలాకివాహముల్
కుకులు, సురద్రు గుచ్ఛములు
గుబ్బలు, వేలుపువాఁక యచ్ఛపుఁ
మెఱుఁగు మణుంగునై, చికిలి
మించఁగఁ దత్పురలక్ష్మి కాంతివి
స్ఫురణభవిష్ణు విష్ణుపద
భూషణమై చెలువొందు నిచ్చలుఁ.

గీ. మండలీభూతశక్రకోదండ మనఁగ
దైత్యచక్రాంగకంపనోద్దండ మగుచు
రమ్యఘృణిజాత నూత్నచిరత్నరత్న
ఝాటమై దీటుమీఱు నవ్వీటికోట.

ఉ. రాణఁ జెలంగునప్పురవ
రంబున నుండు జనుల్ నిజాశ్రిత
త్రాణధురాధురంధరులు
దానయశఃపరిశోభితాత్మకుల్

ప్రాణిదయాళు లౌట యొక
బాధమె యచ్చట నుండునట్టి పా
షాణము వృక్షముల్ పసులు
సైత మభీష్టము లిచ్చుచుండఁగన్.
సీ. అచ్చటికలభంబు లజుపీఠకమలంబుఁ
జేనంటి నైషాదశిక్ష నుడుగు
నచ్చటి తురగంబు లభ్రకేశునిమాళిఁ
గుప్పించి సాదులు ద్రిప్ప మరలు
నచ్చటి యరదంబు లవ్విష్ణురథమును
దలమీఱి సారథుల్ నిలుప నిలుచు
నచటిభటు లజాండ మవియ వ్రేయఁ దలంచి
యది సీరు బుగ్గయం తనుచు నెంతు
రచటి పాత్రలు నృత్తవిద్యానిరూఢిఁ
బూని శారద వెలవెల వోవ నాడి
యాదిగురువని మ్రొక్కుదు రమరపూరముఁ
గోరి వర్ణింపఁబూన నెవ్వారి తరము?
చ. వసువుల కెల్ల సంతతని
వాసము విశ్వవిభూతి కాశ్రయం

బెసఁగు ననంతరత్నముల
కిమ్ముౘ మహాసుమనఃప్రకాండ సం
వసతి మరుద్గణాంచిత
వల్గుసుధర్మము సౌమ్యజీవహా
ర్ష సదనమై చెలంగు నమ
రావతి నెన్నఁదరంబె యేరికిన్?

మ. వరబృందారక గర్భయా పురరమా
వామాక్షికిన్ బ్రహ్మ భీ
కరదైత్యగ్రహశాంతికై సలిలచ
క్రవ్యాజ వర్ణాంకశం
ఖరథాంగాంకిత శుద్ధరూప్యమయ ర
క్షాపట్టికన్ గట్టెనా
హరిపాదాంబుజసంగ గంగయె యగ
డ్తై యొప్పు నప్వీటికిన్.

సీ. కలిగించు నొకకొమ్మ కలమాన్నపరమాన్న
బహుపూపఘృతసూపపానకములఁ
కల్పించు నొక కొమ్మ ఘనసారహిమనీర
పాటీరకాశ్మీరపంకములను

దొరకించు నొకదళం బురుహేమమణిదామ
శాటికాపేటికా సముదయముల
నిచ్చునొక్కొక్కసుమం బెలమించుతుల మించు
ప్రాయంపు గరువంపుఁ బద్మముఖుల
నీగతి సమస్తవస్తువు లీఁగఁ దివురు
వేల్పుమానులుఁ దీవలు వేనవేలు
దనర విలసిల్లుఁ దత్పురోద్యానమగుచు
నందనంబు జగత్త్రయానందనంబు.

౬. శ్రీ లుదయింప దిక్పతులు
చేతులు మోడ్చి భజింపఁ దమ్ముఁడై
శ్రీలలనామనోహరుఁడ
శేషభరంబును నిర్వహింపఁ బా
తాళమువట్టి శాత్రవులు
తద్దఁ గృశింప నిలింపపట్టణం
బేలును భోగసాంద్రుఁడు సు
రేంద్రుఁడు భూరి మహాహాదినేంద్రుఁడై.

౭. వృత్రగర్వస్ఫూర్తి విదళించినయినుండు
పాకసామజమదోత్పాటనహరి

పరమహీభృత్తుల భంజించు జిష్ణుంను
తఱిమైన శరవృష్టిఁగురియు ఘనుఁడు
మఘశతియాజియౌ మహితసుధర్ముండు
భువనైకభారంబుఁ బూనువృషుఁడు
కరమున శతకోటి గలస్వస్థజీవనుఁ
డమరభోగినులతో నలరుభోగి
శచికుచంబుల మకరికాసముదయంబు
వ్రాయు లేఖర్షభుం డనవద్యహృద్య
మాఘ్యవిచికిలరుచిరసమాఖ్యగాంచు
దేవతాసార్వభౌముండు తేజరిల్లు.
చ. అతఁ డొకనాఁడు కుందనపు
టందపుదుప్పటి వల్లెవాటుతో
సతతముఁ దాఁపులీను హరి
చందనపుం జిగి మేనిపూఁతతో
సతుల కిరీటహారకట
కాంగద ముఖ్య విభూషణాళితో
రతిపతిమీఱుసోయగము
రాజసముం దళుకొత్తు ఠీవితోన్.

చ. చిలుకలకొల్కి యొక్కరుతు
చేరి పరాకు పరాకటంచనన్
జలరుహపాణి యొర్తు సర
సన్ కయిదండ యొసంగ ముంగలన్
హాళహాళి నొక్క గంధగజ
యాన బరాబరి చేయ వాలునుం
బలక కలాంచి కుంచె యడ
పం బొకకొందఱుం బూనికొల్వఁగన్.

సీ. వేవన్నెబంగారు వింతగోడలచాయ.
పగలింటి యెండలభ్రమలెసంగ
ఇంద్రనీల స్తంభ సాంద్రరోచిచ్ఛటల్
బహుళాంధకారవిభ్రాంతి నీయఁ
బద్మరాగాంకురప్రాంశు వితర్దికల్
జ్వాలదగ్నిమండల జ్ఞప్తి నింప
నిర్మలవజ్రమణీకుట్టిమంబులు
స్వచ్ఛాంబుపూరసంశయము నింప
నుద్యదితరేతర ప్రతియోగవస్తు
సంగతులు శక్రకార్ముకశక్తియొకొ్క

యనఁదగిన కాంచనాంచితయవనికావి
తాన పరికర్మమైన సుధర్మయందు.

చ. కరమునఁ గంకణాలు విడి
గాజులు గల్లనఁ బల్లవాధరల్
వడిఁ సగ నిల్చి చామరలు
వైవ మహోన్నతభద్రపీఠిపై
సురగరుడాహిచారణ వ
సుప్రముఖుల్ శుచి ధర్మ దైత్యరా
డ్వరుణ సమీర యక్ష పుర
వైరులు సూరెలఁ జేరి కొల్వఁగన్.

క. కొలువున్నతఱిఁ బరాశర
కలశోద్భవ కణ్వ కండు కవి గాధేయా
దులు వచ్చి యతనిచే మ్రొ
క్కులుగొని కనకాసనములఁ గూర్చుండిరటన్.

గీ. నలపురూరవు లాదిగాఁ గలుగు చక్ర
వర్తులు పదాఱుగురు రాజవర్యు లమిత
కీర్తిధుర్యులు వైభవస్ఫూర్తిమెఱయ
నన్నగాహితుసభను గూర్చున్నతఱిని.

సీ. అతిరాత్రయాజుల యరిదికుండలములు
మెట్టె మించులుగాఁగ నెట్టుపఱిచి
సత్రయాజుల వెల్ల జన్నిదంబులు దీసి
సన్నగజ్జెలు గూర్చి సంఘటించి
ఉక్థయాజుల కనకోత్తరీయంబుల
మేలుముసుంగుగాఁ గీలుకొల్పి
అలవాజపేయయాజుల యాతపత్రంబు
లెండకుమఱుగుగా నేర్పరించి
తలిరువిలుకాని బిరుదుపతాక లనఁగ
నోరపైఁటలు జీర నొయ్యారమెసఁగ
వత్తు రింద్రుని కొలువుకు వారకాంత
లచ్చెరువునొంది సురలెల్ల మెచ్చి పొగడ.
మ. గొనబుంజందురుకావిపాడలపైఁ
గ్రొమ్మించురాయంచడాల్
మినుకుంజీరలకుచ్చెలల్ గులుకఁగా
మిన్నేటిపొందమ్ముల
ల్లన వక్త్రాంబుజపాళికిన్ మఱుఁగుగా
హత్తించుచున్ గంతుమో

హానదివ్యాఘ్రములో యనర్గ వెడలి రా
య్యారంబుతో నచ్చరల్.

ఉ. చిన్నిమిటారులో చికిలి
చేసిన మాపునిచిక్కటారులో
వెన్నెలగుబ్బలో మెఱుఁగు
పెట్టిన కెంపుకడానిబొమ్మలో
పొన్నలబంతులో మగుడఁ
బోవనిమిన్నుమెఱుఁగుకాంతులో
యెన్నఁగనంచు నభ్రచరు
లిచ్చలమెచ్చఁగ వచ్చిరచ్చరల్.

సీ. అశ్రాంతనవయౌవనారంభ యారంభ
శృంగారరసరేఖ చిత్రరేఖ
రతిరహస్యజ్ఞానరాశియా నూర్వశి
అంగజాతాస్త్రికి సరణి హరిణి
పాటలాధరజితపానక మేనక
హాటక సమరోచి యాఘృతాచి
తరుణులందెల్ల నుత్తను యాతిలోత్తమ
మణితమంజులభాష మంజుఘోష

రామణీయకవిభ్రమరామ హేమ
సరసనుతగీత నృత్యప్రచార తార
మఱియుఁ దక్కిన వేలుపుమచ్చెకంటు
లెలమి నరుదెంచి రపుడు దేవేంద్రుసభకు.

క. అంజలులు సేసి వేలుపు
లంజెలు నిలిచిరి బలాసురధ్వంసికడన్
రంజనఁ బూజించి రహిన్
గంజాస్త్రుఁడు నిలిపినట్టికైదువు లనఁగన్,

ఉ. వారిజపత్రలోచనల
వాసవుఁడల్లనఁ దేరఁ జూచి శృం
గారపు వింతలేనగవు
కన్గొనలన్ దళుకొత్తఁ గొల్వులో
వారల నెల్లఁగాంచి "యిటు
వచ్చిన యచ్చర గచ్చురాండ్రలో
నేరుచిరాంగి చక్కనిది
యెవ్వతె విద్యలమేటి" నావుడున్.

క. దేవేంద్రుఁ జూచి వరుణుఁడు
"దేవా! దేవరకుఁ దెలియదే సకలంబున్

నీవడిగినచో నుత్తర
మీవలె నటుగానఁ బలుకు దేఁ దోఁచినటుల్

ఉ. ఆటదియన్న నూర్వశి య
థార్థము పల్కుదు నింతెకాని మో
మోటమి నాకు సైఁపదు బు
ధోత్తమ! పాటల నాటలందు స
య్యాటల మేటిచక్కఁదన
మా గొనమా యలబోటికే తగుఁ
పాటలగంధులెల్ల నల
భామిని గోటికి సాటివత్తురే."

చం. అనవుడు మిత్రుఁ "డౌనవు, జ
లాధిపువాక్యము నిక్క మూర్వశీ.
ఘనకచ రూపసంపద జ
గన్నుత మెంతని సన్నుతింప నా
ఘననయదేశ్య రక్తిపరి
కల్పన మేరితరం? బదేమి యీ
మునివరు లిప్పురూరవుఁడు
మున్నగు రాజులు మున్నెఱుంగరే?"

క. అనినఁ బురూరవుఁ డచ్చటి
జననాథుల మొగముఁజూచి "సర్వజ్ఞనిధుల్
ఘను లీమిత్రావరుణుల్
కని పలికిరి నిజ మిదే యఖండిత" మనినన్.

శా. ఆకంధీశ్వరుమాటలున్ నగుచు య
క్షాధీశపుత్త్రుం డనున్
"మీ కీయూర్వశిమీఁది యాస దురుసై
మి మ్మిట్టు లాడించెనో
కాకున్నన్ గుణగుంభరంభను వినా
గా నోర్తు నగ్గింతురా
నాకాధీశుఁడు తక్కువా రెఱుఁగరా
"నారీషు రంభా యనన్"

ఉ. ఏచిన ప్రేమ యక్షసుతుఁ
డీగతిఁ బల్కఁ గండుమాని దా
సైచక "యింద్రుసన్నిధి న
సత్యము లేలర, ప్రేలెదో రి, ప్ర
ల్లోచకు నూరుకాండజిత
మోచకు లేశము సాటి వత్తురే

ఖేచరసిద్ధసాధ్యఫణి
కింపురుషామర చంపకాంగులున్?

ఉ. పున్నమచందురుం గెలుచు
ముద్దు మొగంబును దేటమాటలున్
సన్ననికౌను మేనుజిగి
చందముఁ దీయనిమోవియందమున్
కన్నులతీరు నీలముల
కప్పును మించినకొప్పుసౌరు నా
యన్నులమిన్న కే తగు న
టన్నది విన్నది లేదె యెన్నఁడున్.

క. నాగంబుల నాగంబుల
నాగంబులఁ గెల్చు కురులు నాభియు నడలున్
భోగంబుల భోగంబుల
భోగంబులఁ దరుణిమోము బొమ చను లేలున్.

క. చేరలకు మీఱుకన్నులు
బారెఁడుకీల్జడయు బొమ్మ పట్టుపుకుచముల్
చేరజముల నారజముల
నీరజముఖు లెనయె దాని నీటుకు" ననిరా.

చ. బలిమిని గండుమాని నొక
ప్రక్కకుఁ ద్రోచి విభాండకుం డనున్
"నెలఁతలమేలుబంతి హరి
ణీహరిణాక్షి యె యాలతాంగి దాఁ
గిలకిలనవ్వుచున్ దివిరి
కిన్నరమీటుచు వచ్చుముచ్చటల్
కలుకులు పావురాపలుకు
లున్ బెళుకుల్ మఱి కోటిసేయవే?
చ. పెదవిని వింతకావి నును
పెక్కినకీల్జడతీవి కల్వలన్
జెదరఁగఁజేయు కన్నులును
సిస్తగు జక్కవ నేలుచన్నులున్
మదకరినేలు నెన్నడలు
మల్చినరీతిని నొప్పు నన్దొడల్
ముదముగఁ జూచినంత నల
జోటికి బోటులు సాటి లేరెటన్."
క. వార లిటుపల్కుపల్కులు
సైరింపక కౌశికుండు జడముడివీడన్

దూరంబున జపమాలికఁ
బారంగా వైచి యమరపతి కభిముఖుఁడై.

ఉ. "ఆనిక చేసి పల్కెదహా
హా, కసుమాలపుఁ బంజలంజెల్లా
గానకళావిశారద మొ
గానఁ గళానిధిఁబోలుచాన యా
మేనక యుండు దానిజిగి
మే నకలంక సువర్ణకాంతికిఁ
దానక; మింతి విభ్రమవి
తానక మచ్చెరువిచ్చు నిచ్చలున్.

ఉ. కన్నులు చేరలన్ గొలువఁ
గాఁదగుఁ గొ నరపేద చన్నులా
కిన్నరకాయలంగెలుచుఁ
గీల్జడ బారెడు మోము మోము క
ప్పున్నమచందమామ యొక
పోలిక వాలికతూపు చూపు నా
కన్నులయాన, దాని కెన
గాన జగాన మొగానఁ బల్కెదన్.

క. భూమియు నాకాశంబును
గామినికటిరుచికిఁ గొనుకాంతికి సాక్షుల్
పామును బట్టెద నే నా
భామిని నూఁగారు కెందుఁ బ్రతిలేదనుచున్.

చ. వదలనినిష్ఠ మీఱఁగఁ ద
పంబున వర్తిలు మేము సైతమున్
మదిమదిదానితోఁ దగిలి
మానము మానయు నేటిపాలుగా
నదెయిదె జేపుమా పనుచు
హాయనముల్ పది యుంటి మన్నచో
మదవతి రూపరేఖలను
మాటికి మాటికి నెన్న నేటికిన్?"

చ. అనుటయు మాండకర్ణిముని
"యంద అటుండఁగనిందు మెండుగా
జననుత కామజన్య సహ
జన్య సరోచి ఘృతాచి యున్నత
స్తనకటిభార తార వని
తాజనతానుతనామ హేమ ర

త్యనుపమలాలసాలస మ
దాలస యిప్పురి పంచరత్నముల్."

క. నావిని పరాశరుండను
"నీవేలుపుఁ జెలులు చిలువయింతులు మర్త్య
స్త్రీవితతి దాశకన్యక
లావణ్యముఁ బోలలేరు లక్షాంశంబున్.

ఉ. మాటలు వేయు నేమిటికి
మన్మథమోహనవిద్యయైన యా
పాటలగంధియూరు లల
బంగరుబొమ్మ వెడందకన్ను లా
గాటపుగబ్బిగుబ్బెతచొ
కాటపు నెన్నుదు రెన్నిచూచుచో
నేటికి రంభ యాహరిణి
యేటికి నాశశిరేఖ యేటికిన్?

శా. ఫాలక్షోణి చెమర్పఁ గొనుబెళుకన్
బాలిండ్లు వాంగార దో
ర్మూలంబుల్ దళుకొత్త నూరురుచి సొం
పుల్ గుల్క నేత్రప్రభల్

మీాలందోలఁగ నేటవాలువగ న
మ్మీనాక్షియామేటిలో
నేలేలోయని పాడు చోడఁగడపే
యింపొక్కటే చాలదే?"

సీ. "అంజనాసతిఁ బోలుకుంజరగామిని
కలుగునే యనె మరుద్గణవిభుండు
తప్పుమాట లివేల దారుకావనినుండు
నతివలే యతివ" లంచనె హరుండు
"చాలించవయ్య, సృంజయునికూఁతురి కెన
గారు పోపొ"మ్మనె నారదుండు
"శరవణంబునను గొందఱుకాంత లున్నారు
వారు మీాసర"మని వహ్నిపలికె.
మఱియు సభలోని మునులును సురలు నృపులు
దారుచూచిన చెలుల వేర్వేఱఁ బొగడి
"రంతరం తామెఁ గదమహారాజసభ"న
టంచుఁ గంచుకి వారల నమరఁబెట్టె.

క. అత్తఱిఁ బురూరవుండను
"మెత్తురె యొకపాటిదాని మిత్రావరుణుల్

పుత్తడిబొమ్మకు గుమ్మకుఁ
జిత్తజుచార్వసికి నూర్వసికి సరిగలరే?"

క. ఆరాజరాజనందనుఁ
డారాజుంజూచి "కొంటె లనుకొంటేనే
నారీమణిరంభారం
భోరుకు నూర్ రోసినట్టి యూర్వశి సరియే?

క. అనుటయుఁ జందురు మనుమఁడు
కనుదమ్ములు జేవుఱింపఁ గరకరిమీఱన్
ధనరాజకుమారకునిన్ తో॰.
గనుఁగొని యిట్లనుచుఁబలికెఁ గాంతాళము

క. "ఉండ్రా, యక్షాధమ, నీ
తండ్రిం గని తాళుకొంటిఁ దగఁ గాకున్నన్
తీండ్రంబగు కత్తిని నీ
జీండ్రపు నాలుకదళంబు ఛేదింతుఁ జుమీ!"

చ. అనినఁ గుబేరనందనుఁ "డ
హా"యని బెట్టుగఁ గేకవైచి క్రొ
మ్మినమిన లీనుకప్పుజిగి
మీసముపైఁ జెయివైచి "యోరి ఛీ

చెనఁటి, గరాస, యీసభను
జెప్పినటుల్ మఱి నీవు చేయకుం
డిన విడ రాచకోఁచ, ధగి
డీ," యని దిగ్గన లేచి వీఁకతోఁ౯.

మ. రమణీరత్నము రంభఁ చూడ బురుసా
రంగు౯ జెఱంగు౯ నెఱా
కొమరుం దుప్పటి కాసెగా బిగిచి జ
గ్గుల్ మీఱు గ్రొంబైరుమాల్
జముదాడింబరుఁజంది యేది మఱి రా
జా, లెమ్ము వా ల్గో"మ్మన౯
బొమలల్క౯ ముడివెట్టి వీరరసవి
స్ఫూర్తి౯ విజృంభించుచు౯

క. రూకలకోమటికొడుకా,
పోకలఁ బోమెదవదేర, పోరా పోరా,
నీకు౯ మత్తేకొరడా
చేకొని కొట్టింతుఁ గొంటె చెనఁటి గరాసా!

క. మొగమున మీసము గలిగిన
మగవాఁడై తే కడిందిమగఁటిమి మీఱ౯

తెగఁబడిపోట్లాడవలెఁ
బిగువేమిర, రాచములుచ, విడుతునె నిన్నున్.

ఉ. "పందగులామ, నీవు నొక
బంటవె? గెంటనికిన్కతోడఁ బొ
రందరి చిక్కటూరిని గొ
లారిక మంపిననాఁటి కేచ్చటన్
పొందుగ చాగియుంటివిర,
పోర, ధనంబులు గూడఁబెట్టు వాఁ
డెందును సంగరంబునకు
నేర్పడి ప్రాణము డెంపుచేయునే?

ఉ. బంటుతనంబు లాడుకొని
పారకు; రావణుచేతి పెట్టునన్
కంటికి నీరు గ్రమ్మఁ గల
కంబడిపారెను నీదుతండ్రి నీ
యింటను లేదు పౌరుష మొ
కింతయు; బీరములేల చేతిక
త్తంటకు కోడెకాఁడ! చురు
కంటఁగ వెంటనె చెంపఁగొట్టెదన్."

చ. అని మొలవంక డుస్సి సమ
రార్భటిఁ జావడిక్రిందికిం గుభా
లన దుముకంగ ధనేశసుతుఁ
డట్లనె చేయ జయంతుఁ డిద్దఱిం
బనివడి రెండు బాహువులఁ
బాయఁగఁ ద్రోయుచు మీర లిర్వురుం
దనుజులమీఁద మార్కొని ప్ర
తాపముఁ జూపుఁ"డటంచు నిల్పఁగాన్.

క. "నీకేమి యాతఁ డాతఁడుఁ
బైకొని మార్కొనిన నిన్నుఁ బ్రార్థించిరటో
యీ, కొట్లాటలు దీర్పగ
నాకాధిపతనయ" యనుచు నారదుఁడనియెన్.

సీ. అపుడు విభాండకుం డాగ్రహంబున లేచి
బలిమిచేఁ దనకమండలువుఁ గొట్టి
చెయిమించి మాండకర్ణియుఁ జేతిదండంబు
పెళపెళాలనఁ ద్రొక్కి విఱిచివైచి
పొటుకునఁ బర్వతజటిలుండు జడచుట్ట
విదళించి యటఁ ద్రెంచి విసరివైచె.

కండుమహామని కడుఁగోపగించుక
పడుపాటుగాఁ గక్షపాలచించి
కండ్లువెఱచేసి పటపటఁ బండ్లుకొఱికి
గోచు లెగఁగట్టి జందెముల్ కుఱుచబట్టి
అట్టహాసంబు లొనరించి యూడుఁగఱచి
మునులు గుంపులుగూడుక మొనసిరంత.

సీ. 'తారతమ్య మెఱుంగలే రింద' అని లేచె
గాధేయుఁ డంత లోకములు బెదర
'నీవేమి తెలిసి వర్ణించితో మేనక'
యని యాతని విభాండుఁ డదిమెఁ గేల
'హరిణితోఁ దిరిగిన యడవిమెకంబవీ'
వని కండు వతనిమే నప్పళించెఁ
'గండువు కేకాని కాదు ప్రమ్లోచ' యం
చతనివెఁ దట్టె మహర్షి యొక్కఁ
డదియె పెదపెదమాటలై యలుకవొడమి
జడలు వీడఁగ వల్కలాచ్ఛాదనములు
జార దండకమండలుల్ సాఱవైచె
గజిబిజిగఁ బోరుచుండ నాఖండలుండు.

ఉ. "అచ్చరమచ్చెకంటులకు
నై కడుహెచ్చినమచ్చరంబుతో
విచ్చలుగాను మెచ్చగువి
వేకము లెల్లను వెచ్చపెట్టి వీ
రిచ్చట దొమ్మిగూడి కల
హించినఁ దేరుగ డేలపుట్టు నీ
రచ్చ లణంచఁగా వలయు
రా" యని యింద్రుఁడు చేయమర్చుచున్.

ఉ. గాధిజుఁ జేరి వేఁడుకొని,
కండుమహామునికిం బ్రియోక్తులన్
బోధనచేసి, శక్తిసుతు
పొంతకుఁ బోయి, విభాండకున్ "వృథా
గాథ య"టంచుఁ బల్కి భయ
కారి మునీంద్రుని వాదణంచి స
క్రోధుల మిత్రు నప్పతిఁ బు
రూరవు యక్షుఁ దాళఁ బట్టుచున్.

క. "ఏకాంత ఎవరి కితవో
యాకాంతను వారు పొగడు టదియుక్తం బే

మీ కేల వాదు మీలో
"లోకోభిన్నరుచి" యనెడు శ్లోకమువినరే.

చ. అనుటయు నొక్కతాపసుఁ "డ
హా! పదివేలయినా తిలోత్తమే
వనిత" యనంగ, వేఱొకఁడు
"వామ" ననంగ, నొకండు "చిత్రరే
ఖ"న మఱికొంద ఱాదుఁ "బద
హాటక మాలిని భీమ పుండరీ"
కన, వెసఁ బుట్టెఁబెట్టు కల
హంబులు నారదుఁ డుబ్బియార్వఁగన్.

క. "రాజానుమతో ధర్మో"
నాజను లనుకొందురుగాన నవ్యప్రతిభన్
మాజగడముఁ దీర్పఁగను బి
డౌజా, నీవె"యని మౌనులందఱు వేడన్.

క. "నలువగల సృజించిన య
న్నలువ గలఁడు నిర్ణయింప నలినాక్షుల మి
న్నవగ లటపోవుద"మని
నలువగలన్ శివిమెఱయ నగరిపుఁ డంతన్.

చ. ఉఱుముల బండికండ్లరోద
యొప్పగువాల్మెఱుపుం బతాకలున్
చిఱుమెఱుపుం ధ్వజంబులును
జేరుబలాకలబారు చామరల్
శరమణిచాపముశ్రీల్ వెలయ
సొరగు నభ్రరథంబు నెక్కి భా
సురసురదుందుభుల్ మొఱయ
సూరెల సూరులు సన్నుతింపఁగన్.

సీ. గంధర్వ లోకవంక గాంధారపంచమ
బంధురగాంధర్వపటిమఁ జూపఁ
జారణు లోకక్రేవ ధోరణుల్ మీఱఁగై
వారముల్ సారెకుసారెఁ జేయ
నచ్చర లోకచాయ హెచ్చుకోపుల మెచ్చు
లచ్చెర్వుగాఁగ నాట్యములు సలుప
సంయము లోకయిక్క సామ జయస్తోమ
నామాభిరామమంత్రములు బొగడఁ
ద్రిభువనైకాధిపత్యంబుఁ దెలుపఁజాలు
గొప్పముత్తెంపు జంపులగొడుగునీడఁ

దరుణు లిరుగడఁ జెల్లచామరలు వీవ
వెడలె జేజేలమొకివిూఁదు వేల్పువీఁడు.

క. కసవులు మేసియు నని మొన
నసువులఁ బాసియు విరోధు లలయఁగ యశో
వసువులగు వసువు లుజ్జ్వల
వసువులోలయ వెడలిరపుడు వాసవుమ్రోలన్.

మ. కుడిగోరొత్తులగుబ్బచన్నగని సి
గ్గుల్ గుల్కు డాకంటితో
నెడదాఁ కీల్జడపాటుఁజూచి పులకల్
హెచ్చంగ ముద్దుస్నెప
చ్చడమొప్పన్ నెలవంకతోఁ గనకభా
స్వన్నాగభూషాళితో
మృడు లేతెంచిరి వేడ్కఁ బద్మభవునిన్
వీక్షింప జంభారితోన్.

గీ. తరణికిరణంబు లచ్చరమెఱుఁగుఁబోండ్ల
మెఱుఁగుసొమ్ముల కొకవింత మెఱుఁగు వెట్ట
బారసూరులు సలిపిరి బారు సూరు
లాగమంబుల నుతియింప నాగమంబు.

చ. అల వినువాక కుందనపు
టందపుఁదామరతావిఁ గుల్కుచున్
సొలయు మరుత్కుమారకులు
సొంపుమెయిన్ వెనువెంట నంటఁగా
నలకలు వీడఁ గాను లసి
యాడ సురాంగన లేఁగుదెంచి రు
త్పలశరుఁ డూర్ధ్వలోకముల
పైఁ నిగుడించిన యమ్ములో యనన్.

క. నగరిపుఁ డివ్విధమునఁ జని
నగరీతివిశాలసాలనయనోత్సవదన్
ప్రగుణిత నవరత్న ధగ
ద్ధగితన్ వాగ్గాని రాజధానిం గనియెన్.

సీ. ఏప్రోలు వాణీవరేధితాశోకంబు
శోకంబు మోదంబు సుడియ దెందు
ఏపురి రవికోటిఘృణి యుతాభోగంబు
భోగంబు మోక్షంబు పొసఁగు నెందు
ఏపురం బంబరశ్రీపరమాకల్ప
మాకల్పము వసింతు రార్యులెందు

పిపూర్ణతల్లి యహీనతరానంద
రానందదఘుకర్మరతుల కెందు
సంతతవసంత సరసరసాలసాల
ఫలరసాలోలకీరాది పత్త్రిజాల
గదితబుగ్యజుషంబు నిష్కల్మషంబు
నగుచు నవ్వీడు జోడులే కలరు నెపుడు.

చ. వరజగదండభిత్తికడ
వన్నియకోట బహిస్స్థితాంబువుల్
పరిఘ ల తఃపరప్రకృతిఁ
బాదమహావనదుర్గమై తగన్
కరమరుదారు నేపురము
కామరుషాపరుసారికోటులన్
దరియఁగనీయ దన్నలువ
నాల్గుమొగాలఁ బరామృశింపఁగన్.

శా. ఆలోకంబునఁ గోటిసూర్యనిభది
వ్యాస్థానమధ్యంబునన్
శ్రీలింపొందు చిరత్నరత్నవిలస
త్సింహాసనాగ్రంబునన్

బాలాదిత్యమహాసహస్రదశయుక్
పద్మోజ్జ్వలత్కర్ణికన్
హేలాసృష్ట జగత్త్రియుండు కొలువుం
డెన్ ధాత చేతోధృతిన్.

సీ. క్షణకళాఘటికాదికాలంబు సాకార
మై గడియార మందంద పల్క
గ్రహతారకారాశిగణము లల్లనఁ జేరి
పంచాంగదినశుద్ధిఁ బల్కరించ
సకలదిగ్దేవతల్ సభికుల నెల్లను
జోటులెఱింగి కూర్చుండ ననుప
పంచభూతంబులు ప్రణమిల్లి యేసృష్టి
నేమించునో యని మోముఁ జూడ
వేదములు వందిజనములై వినుతిసేయ
శాస్త్రములు వేత్రపాణులై సంచరింపఁ
జెలఁగి కొలువున్న త్రైలోక్యసృష్టికర్త
నగరివాకిట నిజవాహనంబు డిగ్గి.

క. ప్రతిహారి తోడరా న
ప్రతిహారివిభూతి మెఱయ నమరేంద్రుఁడు దా

శతధృతిసన్నిధికిం జని
నతిచేసి సమున్నతాసనంబున నుండెన్.

ఉ. సారసపత్రనేత్ర విల
సన్నవనీరదగాత్ర పావనో
దారచరిత్ర కంసముర
దానవజైత్ర రమాకళత్ర శం
పారుచినేత్ర బోధరస
మాత్ర పృథాసుతమిత్ర భక్తహృ
న్నీరజబాలమిత్ర వర
నీరజపత్రపవిత్రకీర్తనా !

క. కస్తూరీతిలకాంకిత
నిస్తులముఖచంద్ర వదననిందితచంద్రా
అస్తోకద్యుతివిస్తృత
కౌస్తుభమణివక్ష విమలకమలదళాక్షా !

స్రగ్విణి

వారణాధీశదుర్వార భీవారణా
ధారణా యోగిహృద్వ్యాసనిర్ధారణా

కారణశ్రేణికాకల్పనా కారణా
చారణక్షేమవైశాల్య దోచ్చారణా

- గద్య -

ఇది శ్రీమత్పాండ్య మండలాధీశ్వర శ్రీవిజయరంగ
చొక్కనాథ మహీనాథకరుణాకటాక్ష సంపా
దిత గజతురంగ మాందోళికా ఛత్రచామర
విజయకాహాళభూరి భేరీబిరుదధ్వజ ప్రముఖ
నిఖిల సంపత్పారంపరీసమేధమాన స
ముఖ మీనాక్షీనాయక తనూభవ
శ్రీమీనాక్షీదేవీ కటాక్షలబ్ధకవి
తాసాంప్రదాయక వేంకట
కృష్ణప్పనాయక ప్రణీతం
బైన యహల్యాసం
క్రందనంబను మ
హాప్రబంధంబు
నందుఁ బ్రథ
మాశ్వా
సము.

శ్రీ

# శృంగారాహల్యాసంక్రందనము

## ద్వితీయాశ్వాసము

శ్రీ కనకవిమానాంతర
కాకోదరరాజతల్ప కలితాపేక్షా
శ్రీకనకాంగీప్రేమధు
రాకలితవిశాలవక్ష రంగాధ్యక్షా !

వ. అవధరింపుము.

క. ఆమెడ నవ్వలికథ సా
ఖ్యాయతి జనమేజయుండు కరుణింపుమనన్
ధీయుతవర్యుఁడు వైశం
పాయనుఁ డిట్లనుచుఁ బలికెఁ బరమప్రీతిన్.

ఉ. ఆమెయిఁ జిన్నినవ్వు వద
నాబ్జనివాసినిమైన చానకున్
గోమలకాంతివింత మెఱుఁ
గుల్ ఘటియింప విరించి యిట్లనున్

"సేమమె నీకు సర్వసుర
శేఖర, భద్రమె దేవకోటికిన్,
ధీమహితుల్ మునుల్ సుఖులె,
నీ విటువచ్చిన దేమి" నావుడున్.

ఉ. "స్వామికటాక్షవీక్షలని
శంబును గల్గుటఁజేసి యేమెయిన్
సేమమె మాకు సర్వసుర
శేఖర! నే నొకప్రశ్న చేసెదన్
నీమనుసృష్టి సేసిన య
నేకవిధప్రమదాజనంబులో
నేమదిరాక్షి చక్కనిది
యేర్పడ నానతియిమ్ము" నావుడున్.

క. మోమునఁ జిఱునవ్వొలయఁగఁ
దామరచూ లనియె నముచిదమనునితోడన్
"నామనసుకు సరిపోయిన
భామామణిఁ గాన నీప్రపంచములోనన్.

సీ. రంభ యెన్నఁగ జడప్రాయ యూర్వశి నల్పు
జీవంబు లేనిది చిత్రరేఖ.

వామన పొట్టిది వక్రాంగి శశిరేఖ
హరిణియటంటిమా యడవిమేకము
గానుగరోల్ చాయఁ గనునత్తిలోత్తమ
పగలు చూచినచో నభాస తార
ధాన్యమాలిని మోము దర్శించిన ఖరంబు
పాండువుమేనిది పుండరీక
నాగకన్య లటంటిమా నడలు కుంటు
తక్కువారలచందంబుఁ దలఁపనేల
ముజ్జగంబులలో నున్నముదితలందు
నొచ్చె మొకయింత లేనిది యొక తెలేదు.

సీ. కన్నులైతే సరే, కన్నవిన్నదిగాని
మించుఁదళ్కులు గ్రుమ్మరించవలదె!
చన్నులైతేసరే, స్మరరాజ్యపట్టాభి
షేకకుంభంబులై చెలఁగవలదె
వదనమైతేసరే, వరమనోహర్షాబ్ధి
శరదిందుబింబమై మెఱయవలదె
రూపమైతేసరే, చూపరకనులకు.
నిర్వాణసౌఖ్యంబు నింపవలదెఁ.

కాంతమైనంత సరియె నిష్కామముద్రైన
మౌనిమరునైన మరునిబందాలుగాఁగఁ
జేయవలవదె యిటువంటిచిన్నిచాన
ముజ్జగంబులలోఁగాన బుధనిధాన!

మ. కుదురై యొప్పులకుప్పయై తనువునం
గోరంత యొచ్చెంబు లే
నిదియై నొవ్వని జవ్వనంబు గలదై
నిద్దంపుటొయ్యారియై
మదనోజ్జీవితయై గరాగరికయై
మాణిక్యపుం బొమ్మయా
మదిరాక్షిన్ సృజియింతు నే నొకతె మ
న్మాహాత్మ్యముల్ జూడుమా!"

క. అనిపలికి పద్మగర్భుఁడు
తనగురుఁ గడుఁ బద్మనేత్రుఁదలఁచి ప్రయత్నం
బొనరఁ జతుర్దశలోకీ
వనితాజనతాతిశయితనై ఖరి యెసఁగన్.

సీ. చందురులోమైల జలజంబులో దువ్వ
యూడ్చి హొంద్రోచి రెం డొకటిసేసి

అరుణాశ్మకాఠిన్య మమృతపాండుగుణంబు
నుడిగించి యారెంటి నొకటిసేసి
అరులజో డెడయించి గిరులప్రతాపంబు
పెకలించి యారెంటి నొకటిసేసి
యిభతుండచాంచల్య మిల ననంటులజాడ్య
మొడిచి యారెంటిఁ దా నొకటిసేసి
కులుకు నెమ్మోము కెమ్మోవి గుబ్బచన్ను
లరిదియూరులు నిర్మించి యంగజునకు
వింతకైదువుగా నొక్క దంతిగమన
నబ్జభవుఁడు సృజించె నహల్య యనఁగ.

వ. ఇట్లు నిర్మించిన.

ఉ. అంబుజగంధి చక్కఁదన
మ్మల్లనఁ గన్గొని విస్మితాత్ముఁడై
యంబుజనేత్రుఁ డప్పుడు త్రి
యంబకభావముఁ గోరె నాతఁ డ
ష్టాంబకలీలఁ గోరె మది
నాతఁడు గోరె సహస్రలోచన

త్వంబు నతండనంతనయ
నత్వముఁగోరె మఱేమి చెప్పఁగన్.
చ. వనితనుగాంచి రంభ తల
వంచెఁ, దిలోత్తమ మోము నల్లచే
సెను, శశిరేఖ లోఁగమలెఁ,
జేష్టలుదక్కెను జిత్రరేఖ కాఁ
కనొగిలె హేమ, మైమఱపు
గాంచె మదాలస, తగ్గఁజెందె వా
మన, కరఁగెన్ ఘృతాచి, యవి
మానత మేనక గాంచె నెంతయున్.
సీ. రాజయోగారంభరతులైన యతులైన
వదనంబుఁగని పారవశ్యమొంద
వరకుండలీంద్రభావనులైన మునులైనఁ
జికురపాశముఁగాంచి శిరము లూఁపఁ
బద్మాసనాభ్యాసపటులైన వటులైనఁ
బదకాంతిఁగన్గొని ప్రస్తుతింప
నిర్గుణపరతత్త్వనిధులైన బుధులైన
నవలగ్నలతఁగాంచి యాసఁ జెంద

వినుతసకలాగమాంతవాసనలుగన్న
ధన్యులైనను నెమ్మేనితావిఁ గోర
నలినసంభవుకడ నిల్చె నయనవిజిత
ముగ్ధసారంగి యాజగన్మోహనాంగి.

ఉ. బాలకురంగనేత్రి నునుఁ
బల్కులకున్ విరివింటివానిబా
బాలకువాడు పెన్దొడల
బంగరురంగుమెఱుంగు లంటికం
బాలకు రాదు నెమ్మొగము
బా గలపున్నమచందమామదం
బాలకుమీఁదు దానిసరి
బాలిక లేదు జగత్త్రియంబునన్.

క. కుందరమాదంతావళి
మందరమాచన్నుఁదోయి మైజగ్గుజగా
హాంందరమా యాభామిని
ముందర మానినియుఁగలదె ముజ్జగములలోన్.

గీ. తూపు రూపుమాపుఁ దొయ్యలి నునుజూపు
సోముగోము నోము భామమోము

కెంపుసొంపునింపు శంపాంగియధరంబు
గౌరు సౌరు చేరు కలికినడలు.

గీ. లతల వెతలఁ బెట్టు లలితాంగినునుమేను
కలువ గెలువఁజాలుఁ జెలువచూపు
శుకముమొగముఁ గొట్టు సుకుమారిమాటలు
దరముఁ దఱుము లీలఁ దరుణిగళము.

సీ. గిండ్లుగా గజనిమ్మపండ్లుగా బంగారు
చెండ్లుగా సింతిపాలిండ్లు దనరుఁ
గావిగా నమృతంపుబావిగా రుచిఁ దేనె
క్రోవిగా నలివేణిమోవి దనరు
రూపుగా మరుచేతితూపుగా సిరులకుఁ
బ్రాపుగాఁ బూఁబోణిచూపు దనరుఁ
గుల్కుగాఁ గప్పురంపుఁబల్కుగా రాచిల్క
కళ్కుగా లతకూనపల్కు దనరు
తమ్ములనుగొనుఁ దమ్ములఁగొమ్మ ముఖము
సరులు నీలంపుసరులకుఁ దరుణికురులు
వింటికొనలకు సమము వాల్గంటి బొమలు
వర్ణితములౌనె శ్రీ లింతికర్ణములకు.

సీ. పల్లవమ్ములకాంతినెల్ల వమ్ముగఁ జేయు
కామినీపాదపంకజము నిజము
తామేలుసొగసు న న్నేమేలు ననిమించు
బింబాధరీప్రపదంబుడంబు
వరిపొట్టకట్టు లావరిపొట్టని తలంచు
కలికిపిక్కలరంగు కలహారంగు
రంభ మైపట్టు లారంభమంద విడుల్చు
తొయ్యలిబంగారు తొడలుకడలు
చిలువబాగారు నయ్యారె, చెలువయూరు!
తొలుకనాకాశతులకౌను చెలియకౌను
లలితపున్నాగముసనాభి లలననాభి
కనకలికుచంబు వరబాలికాకుచంబు.

క. వరమా కరతల, మిందీ
వరమా కనుదోయి, హంసవరమా నడ, ని
ల్వర మాచెలిఁగన మరుచే
వరమాయగఁ దనరె లోకవరమా యనఁగన్.

క. కరమానునుదొడ, దర్వీ
కరమాజడ, జంఘ మేల్మకరమా, చపలా

కరమా తనులత, కమలా
కరమా చెయి, చెలిని ధర సుకరమా పొగడన్.

చ. కినిసి కుచాననాంగరుచి
గిన్నెలతో నెలతో లతోన్నతిన్
ఘనకచకంఠరూపములు
కందరమై దరమై రమైక్యమై
గొనబగు వాక్కటీక్షలటు
కోయిలకో యిలకో లకోరికో
వనితనొసల్ వళుల్ నడుము
బాలహరిన్ లహరిన్ హరి న్నగున్.

క. గోరస మాపల్కులరుచి
సారస మాముఖవిలాససంపద మరుచే
నారస మావీక్షణ మళి
కారస మా కేశపాశ మబ్జాననకున్.

శా. బంతే చన్గవ నిగ్గు మేనురుచిపో
ల్పన్ జాళువా మేలుడాల్
దొంతే కన్నులధాళధళ్యరుచు లెం
తో కల్వాకున్ జూడ మేల్

బంతే కంతునిదంతినేలునడలుగా
బాగైన యీభామరుగా
ఎంతేలేదు నమాన మెంచుటకుఁగా
నీరేడులోకంబులగా.

సీ. తనుసృజించినబ్రహ్మ తనయంద మీక్షించి
తన్మయత్వము నొంది తత్తరింప
నైష్ఠికులైన సనత్సుజాతాదులు
మది జల్లుమన హరిస్మరణసేయ
నధ్యాత్మవిజ్ఞాను లైన సన్న్యాసులు
పరవశులై గగుర్పాటుఁజెంద
వాణియు నప్సరోవనితాజనంబులు
మగవారు కామైతిమని తలంప
ముద్దుముంగుర్లు కొనగోట దిద్దుకొనుచుఁ
దెలివిచూపు లకాలచంద్రికల నీన
నడలుగని ధాత తేజీలు జడనుపడగ
బాల్యయౌవనకల్య యహల్య యొప్పె.

సీ. అమృతాశనాధిపత్యము చెల్లునా దీని
యధర మానకయంచు నమరవిభుఁడు

దక్షిణనాయకత్వముపోలునా దీని
　　రతులఁ దేల్పకయంచు రవిసుతుండు
నవరసరసికత హావణించునా దీని
　　సారెఁ గూడకయంచు శరధివిభుఁడు
సార్వభౌమస్థితి సమకూరునా దీని
　　వెంట నంటక యంచు విత్తవిభుఁడు
నలఘుశతకోటికాంక్షలు నతనుదండ
భృతులు నంజనతృష లలకేహితములు
నిన్మడింపఁగ ననిమిషదృష్టులైరి
అంబుజభవోపలాల్య నహల్యఁజూచి.

సీ. కల్కికటాక్షంబు గల్గితేగద తాను
　　గుసుమాస్త్రుఁడ నటంచుఁ గుసుమశరుఁడు
కొమ్మవాతెఱతేనెఁ గ్రోలితేగద తాను
　　మధువు నౌదునటంచు మాధవుండు
నెలఁతముద్దుమొగంబు నిమిరితేగద తాను
　　ఘనకళానిధినంచుఁ గమలవైరి
సుదతియూరుపుతావి సోఁకితేగదతాను
　　గంధవాహుఁడటంచుగాలివేల్పుఁ

దలఁచి రచ్చట సిద్ధగంధర్వయక్ష
చారణాదులు దత్కాంతిపూరవార్ధి
మగ్నులై చిత్రరూపులమాడ్కినుండి
రంత శచికాంతుఁ డెంతయు నాత్మలోస.

మ. ఎలమించుక్ దులమించు హేమలతయో
యీ రేడులోకంబులక్
వలపించందగు కామదివ్యకళయో
వాంఛక్ద్రిలోకీదృగు
త్పలనీహారమయూఖరేఖయొ జగ
ద్భాగ్యంబె యీరూపమై
లలిఁ గన్పట్టెనొకాక యింతులకు నీ
లావణ్యముక్ గల్గునే.

ఉ. డంబులు శైలశేఖరవి
డంబులు దీనికుచంబు లెన్న నా
చ్చెంబులువల్కుఁ గుందనపుఁ
జెంబుల, నిద్దపుటద్దముల్ గపో
లంబులు, నీలమేఘపట
లంబులు పెన్నెరు లౌర, యౌర యా

యంబుజగంధి రత్న మిల
యందలి సుందరులందు నెంచఁగన్.
శా. రేరాజున్ నగుమోముతో వనరుహ
శ్రీఁ గేరుకందోయితో
బారన్ గొల్వఁగవచ్చు పెన్నురముతో
బాగైన నెమ్మేనితో
నీ రాజెవ్వఁడు సానురాగమున న
న్నే చూచుచున్నాఁడు మే
లౌరా సోయగమంచు జిష్ణువు సహా
ల్యాభామయున్ గన్గొనెన్.
క. అప్పుడు పూర్వాకకుప్పతి
తప్పక యుత్తరుణిఁజూచెఁ దరుణీమణియున్
తెప్పల నార్పక చూచెన్
గుప్పెన్ మరుఁ డిద్దఱన్ లకోరులచేతన్.
క. జగముల నన్నిటి నేలుచు
నగణితసౌందర్యవిక్రమైశ్వర్యములన్
బాగడొందెడు తనకంటెను
మగువకుఁ దగినట్టి వేఱె మగఁడుం గలఁడే.

చ. అని తనుఁజూచి తోడనె య
హల్యను గాంచి సభాసదావళిన్
గనుఁగొని తాను వేఁడునెడఁ
గాదనఁడంచు సురేంద్రుఁ డిట్లనున్
"వనరుహగర్భ మీమహిమ
వర్ణనసేయఁ దరంబె యద్భుతం
బనుపమ మక్షిభాగ్యఫల
మై తగు సృష్టి యొనర్చి తింతలోన్.

ఉ. చక్కఁదనాలకుప్పయగు
చక్కెరబొమ్మను సృష్టిచేయుటే
యెక్కువగాదు దీని మది
కింపగు నాథుని నిర్ణయించినన్
జక్కనితారతమ్యములు
సర్వ మెఱుంగుదు నైనఁ దెల్పెదన్
దక్కొరు లెవ్వరుంగలరు
తన్వికి నేనొకరుండు దక్కఁగన్.

క. నరులన్ గిన్నరులన్ గిం
పురుషులఁ జారణుల సిద్ధపురుషుల ఋషులన్

బరికింపుము వీరలలో
విరిబోఁడికిఁ దగినవాఁడు వీఁడని చెపుమా!
ఉ. ముందుగ నేను వేఁడితిని
మున్నుగ నే నినుఁ బ్రశ్నసేయఁగా
నిందుముఖిన్ సృజించితివి
యెవ్వరికిన్ బనియేమి దేవరా
జ్యేందిరవోలె బాల ననుఁ
జెందుటయుక్తము జాతిరత్నమున్
కుందనమున్ ఘటించినఁ ద
గున్ మఱియొక్కటి యొప్పియుండునే."
క. అనుటయుఁ బకపకనగి య
వ్వనజజుఁ డను "నీకు నీవె. వడ్డించుకొనన్
జనునే యిప్పుడు నీ కి
వ్వనిత పొసఁగ దరుగు మగుడవచ్చినత్రోవన్"
క. అనిపల్కి యచటనుండెడి
మునులం గని వీరలెల్ల మున్నొక తోకల్
గొనియుందురు గౌతముఁ డొకఁ
డనఘుఁడు. నైష్ఠికుఁడు వాని కర్హ పటించున్

క. అక్షపదుఁ భావితకమ
లాక్షపదుఁ బిలిచి ధాత "యబ్జదళాక్షిఁ
రక్షింపు మిది భవద్వ్రత
దీక్షకు శుశ్రూషఁ జేయు ధృతమతినను చుఁ

ఉ. తేఁటిమెఱుంగుముంగురులుఁ
చేటకనుంగవ లేఁతకౌనులుఁ
వాటపుముద్దు మేనులును
వట్రువచన్గవ గల్గువారిఁగా
నాటకుఁ బాటకుఁ గవిత
లల్లుటకుఁ దిటమైనవారిఁగాఁ
బాటలగంధులఁ సఖుల
బల్వుర నిచ్చి యహల్యకిట్లనుఁ.

క. "మునికిఁ దినకరసమధా
మునికిఁ బరిచర్య సేయు ముదితాశయవై
ముని కింశుకవనికిం జను
మునికిఁ నీకగుశుభంబు లుత్పలగంధీ!"

చ. అని పనివంచ మంచిదని
యంచితభక్తి విరించికిఁ వచో

వనితకు మ్రొక్కి యక్కలికి
　　వల్లు విభూషణభూషితాంగియై
మునిపతివెంట నేఁగె సుర
　　ముఖ్యుని వీడ్కొని; యింద్రుఁ డయ్యహ
ల్యను మది నెంచియెంచి మరు
　　నమ్ము లురమ్మున డుస్సి పాఱఁగన్

క. అమరావతికిన్ వెసఁ జని
యమరావలిఁ బనిచి కుసుమితారామములో
సమరారిన పువ్వులశే
య్య మరాళీగమనఁ దలఁచియాత్మగతమునన్.

ఉ. ఎన్నికలేలనీలమణు
　　లెన్ని సరోజములెన్ని దొండపం
డ్లెన్ని దరంబు లెన్ని గిరు
　　లెన్ని మృణాళములెన్ని పొన్నపూ
లెన్ని యనంటులెన్ని దొన
　　లెన్ని ప్రవాళములెన్ని రత్నముల్
చెన్నుగఁ గూర్చి యేర్పఱిచి
　　చేసెను ధాత తడంగమాలికన్.

చ. మదనునిపొందుఁ గోరి రతి
  మానిని నోమిననోములెల్ల నీ
యదన ఫలించెనో యనఁగ
  నంగనగుల్ఫము లుల్లసిల్లు దఁ
త్పదము లొనర్చి పద్మజుఁడు
  పాణితలంబు విదుర్పఁ జిందుత
త్పదమలకాంతిబిందులు ర
  సాలకిసాలబిసప్రసూనముల్.

చ. మదవతిపాదముల్ దనకు
  మాతృసమానములంచు ధాత స
మ్మదమునఁ బూజచేసినసు
  మంబులనన్ నఖపంక్తి యొప్పగున్
మృదుగమనాగమంబు లెల
  మిన్ బతియించి యుపన్యసించు చా
యఁ దనరు మంద్రనాదకల
  హంసకముల్ విలసిల్లు నింతికిన్.

చ. నవముగ మోముచంద్రుఁడు గ
  నంబడి కప్పురతావిగుప్పెడిన్

రవికనె పిక్కటిల్లెను ఘ
    న స్తనచక్రము లొప్పెఁ దారకల్
నవిసెను బాల్యపుంజడది
    నంబు లటంచని జైత్రయాత్రకై
కవదొన లుంచె నిర్గముగఁ
    గంతుఁడనన్ జెలిజంఘ లొప్పగున్.

క. ఊరుయుగం బను పేరన్
బారెడుబంగారునీటివాఁకను రతియున్
మారుఁడును జిన్నిగరిగలు
సారుగ ముంచిరనఁ జెలికి జానువు లమరున్.

క. కదలికలన్ మలినంబై
కదలికలన్ బొరలువిచ్చు కర్పూరంపున్
కదలికల నవ్వ శశిపా
కదలికయూరుజిగి తెలిజగాచల్వ రుచిన్.

* * *

క. కలదని కొందఱు లేదని
యిలఁ గొందఱుఁ బలుక రెంటి కీరట్టుగ న
చ్చెలికౌను మధ్యమస్థితి
మలయుచునుం డట్లుగాన మధ్యంబయ్యెన్.

చ. నలువగురోమరాజి యము
నానదివారి తదీయవీచికా
వళి వళులయ్యె నందుసుడి
వర్తులనాభి తదంతరీప మ
చ్చెలియనితంబబింబ మటు
చేరువ గన్పడునట్టి రాజనం
బుల పొటకట్టులుఁ మఱియుఁ
బోవఁగ నాగెటిచాలు నొప్పగుఁ

సీ. తమ్మిమొగ్గలు గాదు తారావళీహృద్య
శృంగారభంగి నెసంగుకతన
గజకుంభములు గావు కంఠీరవేంద్రావ
లగ్నభంగైకఖేలనము వలన
జక్కవకవ గాదు సరసల నెలవంక
లుంచంగ యోగ్యమై యుండుకతన
శైలేంద్రములుగావు శైలేంద్రగర్వంబు
ద్రుంచునె మున్ను భ్రమించుకతన,
మున్ను శంకరుఫాలాగ్నిఁ బొసఁగఁబడిన
యతను బ్రతికించునట్టి దివ్యామృతంబు

లునుచు బంగరుకలశంబు లఁనగవలయు
వనితకుచములు పొగడ నెవ్వరితరంబు.

క. తరుణికరద్వయసామ్యముఁ
బొరయఁగ బ్రాహ్మోపవేశ మొనరించెఁ గుశా
స్తరణమునఁ గమలంబులు
ధరణిఁ గుశేశయపదంబు దానం బూనెఁ.

చ. ధరణిని గంధరాహ్వయముఁ
దాల్చి కుచాద్రితటోపరిస్థితిఁ
దిరముగ నుండి క్రొమ్మెఱుగుఁ
దీగెచెలంగఁగ మౌక్తికచ్ఛటా
భరణ మెసంగఁ గంబురుచి
పాటిల మోహతమంబు నించి య
మ్మరువపుబంతి యింతికి సు
మంగళమౌ గళమొప్పు మెప్పుగఁ.

మ. సకలాభీష్టము లిచ్చునంచు సుమన
స్సందోహముల్ సన్ను నా
యకరత్నంబని యెన్నునట్టి వనునా
హాకొమ్మకెమ్మోవి యెం

చకయుండఁగ గతినంబటంచు ననుచిం
తాభారముఁ మీఁదఁ దా
ల్చికచా వేలువు మానికంబుగనిమెఁ
జింతామణీ నామముఁ.

క. పగడంబుడంబు వలదను
జిగురాకుఁ రాకుమనునుఁ జెలివాతెఱ యా
వగలాడినాస యాసం
పగిమొగ్గఁ బగులఁ ద్రొక్కుఁ బగమగలీలఁ.

ఉ. క్రొన్నెలవంకశంక లిడు
కుల్కుబొమల్ గని యచ్చకోరముల్
పన్నుగ నోప్పు తెప్పల నె
పంబునఁ జొక్కపుతెక్క లార్పుచుఁ
కన్నులు గల్కికన్నులయి
కన్పడె నాజిగిడాలుఁ జూచి యా
కన్నులవింటిరాయఁడు జ
గంబులు గెల్వఁగ డాలుఁగై కొనెఁ

క. నాసా కాంచనకోశచ
కాసాదృగ్విభ్రమంబు కర్ణాటశ్రీ

భాసురమై చెలిమోము వి
భాసిల్లెన్ రాజరాజపట్టాంచితమై.

చ. అలికచమోముఁ బోలను సు
ధాంశుసరోజము లొక్కపుష్కర
స్థలమునఁ బ్రార్థనల్ సలుపఁ
జంద్రుఁడు పొందెఁ బ్రసాద మంతలో
పల బహురాజపాన మధు
పస్పరిశంబున యోగభంగమై
జలజమటుండెఁ గానియెడఁ
జందురునిం గని సైఁచియుండునే?

ఉ. భామినియారు సూదిమొన
పైని జనుంగవపోక లుంచి యా
పై మఱినిల్చి కంఠము త
పస్స్థితి నబ్జత నొందె మోవియుర్
దా మదిఁజూచి యబ్జతను
దప్పక పొందె మొగంబు నట్లనే
యేమఱకబ్జతం బడసె
నింపుగఁ గన్గవ చెందె నబ్జతన్.

చ. తొలి నవపత్రమై పటిమ
దోఁపమిచే శతపత్రమై చలం
బెలయ సహస్రపత్రమయి
యింతిపదంబులు దాఁకి తోడనే
దళములఁ బాసి రోసి బిస
దండముఁ జెందెఁ గముండ లుత్తగ౯
నలినము హంస సంగతి ది
నంబునుగాంచు నభీష్టయోగము౯.

ఉ. మారుఁడు లోకముల్ గెలిచి
మాతృగృహంబున నుంచె జైత్రతూ
ణీరము లన్నయట్లు తరు
ణీమణిపాదయుగంబుమీఁద జం
ఘారమఁ జూడ నొప్పె నటు
గాకయ హేమ మయోపకాండముల్
మీఱు నె తత్సమీపమున
మించిసమంచిత శైత్యసంపద౯.

ఉ. అంబుజగంధియూ రువుల
యందముతో సరిబోఁరవచ్చి హే

రంబు గజేంద్రహస్తముతి
రంబుగఁ జెందెను దంతభంగ మ
య్యంబరదంతిరాట్కరము
నభ్రముఁ బట్టుక ప్రాఁకు దానిచే
తంబడునంటికంబములుఁ
దార్కొనినం దలవంపు లౌఁగదా!

గీ. ఛిన్నిపదముల హాలరేఖచేత సీత
దీలుపడు కౌనుచేత విదేహజాత
గోముమీఁటెనకటిచేత భూమిపుత్త్రి
యనఁగ విలసిల్లు నయ్యింతి యతనుదంతి.

క. కురులో మొమ్మగు తుమ్మెద
గఱులో చకచకితకాంతిఁగనుసీలపురా
సరులో యిందీవరపుర్
విరులో యిరులోయనంగ వెలఁదికి నమరుఁ.

గీ. తూండ్లు భుజములు జాళువాగిండ్లు గుబ్బ
లేండ్లుపదియాఱు నెన్నఁటికెన్నఁటికిని
విండ్లు కనుబొమ లౌర, యీవెలఁది వేడ్కఁ
బెండ్లియాడినఁగద నేను బెండ్లిగాంతు.

ఉ. మాయురె! తత్సమాన యగు
　　మానినిఁ గాన జగంబులోన నా
హా! యిటువంటి చక్కఁదన
　　మవ్విధి యెవ్విధిఁ జేయనేర్చెనో
హాయిరె! బాలచూపు తుద
　　లొక్కటఁ జెక్కఁడపుగా మెఱుంగులై
నాయెద దుస్సిపారె రతి
　　నాథుని యాధునికాస్త్రమై ఖరీ.

సీ. మెలఁత మైజిగిఁ బోలు మెఱుపుఁ జూచెదనన్న
　　నింపొందఁ గందోయి యెదుట నిలదు?
సభిమోము సొబగొందు చంద్రుఁ జూచెదనన్న
　　మబ్బు నిబ్బరముగా మరుగువడెను
చెలిగుబ్బసరి జక్కవలను జూచెద నన్నఁ
　　బక్షపాతము గల్గి బైటఁ దిరుగు
మగువ యారీడుపన్నగముఁ జూచెదనన్న
　　బిలములోపల నుండి వెడలు టరుదు
వనితయవయవసాదృశ్యవస్తువులను
జూచియేనియు నొకపాటి సుఖముఁ బడసి

చింత మదిలోన నుపశమియింతుననిన
దానికినిసైత మాబ్రహ్మ తాళఁడాయె.

చ. తన కది కూఁతురాయె పుర
దానవవైరికిఁ జెల్లెలాయె న
వ్వనధిసుతామనోహరుఁ డ
వాప్తసమస్తమనోరథుండు గా
న నది యలక్ష్యమే నొకఁడ
నాతికి సర్వుఁడ సన్నటుంచి బా
పని పరి చర్య కంపె నల
బంగరుబొమ్మను బొమ్మ నేమనన్.

క. కామునిచర్యల కగు చెలి
కామునిచర్యలకునగునె యకటా మాధు
ర్యామలసాహితిరసికశి
ఖామణికినిగాని మడ్డిగానికిఁ దగునే?

గీ. కమ్మవిల్కానియమ్ముల కమ్మలించి
నెమ్మి నేవేఁడ నెమ్మది సమ్మతిలక
పొమ్మనియె ముద్దుపుత్తడిబొమ్మ నియక
బొమ్మయే వాఁడు పెనుఱాతిబొమ్మగాని.

చ. మునుకొని సిగ్గుతో నళికి
మో మటు ద్రిప్పి కరాంగుళిద్వయం
బునఁ జుబుకంబు నెత్తి నును
మోవిని గ్రోలినఁ నొచ్చె నొచ్చె నం
చని తనలోనఁ బల్కుచు ర
వంతయుఁ గంతునిఁ దోపనీయకే
కనుఁగవ కింపుసేయు నల
కన్యను, గూడి చెలంగు టెన్నఁడో.

చ. మిసమిసలీను మొల్కచను
మిట్టల కట్టిటు కేలుసాచఁగా
దుసికిల నట్టె మిట్టిపడి
తోయ్యలి చెయ్యటుద్రోయ నెయ్యపుః
గొసరులఁ గుస్తరించి కొన
గోటను బొక్కిలిఁ జీజి మెల్లనే
యొసపరి నీవి కొగ్గుచు న
మో కడువేడుక లందు టెన్నఁడో!

చ. చనుఁగవ క్రేవఁ జూచుచును
స్వస్తికహస్తము చేతఁ గప్పుచుః

గొనబుగ ముద్దుపెట్టుకొనఁ
　　గొంకుచు మో మటునిట్టుఁ ద్రిప్పుచుఁగ్
గనుఁగవ మూసి నాదు రతి
　　కౌశలిఁ జూడక సిగ్గువెల్లిలో
మునుఁగుచు నుండు ముగ్ధయగు
　　ముద్దులగుమ్మను జూచు టెన్నఁడో!

సీ. సిబ్బెంపుగుబ్బలఁ జెనకనీయని సిగ్గు
　　చెనకినఁ బులక లెంచించు తమియు
కొమరైన వాతెరఁ గ్రోలనీయని లజ్జఁ
　　గ్రోలినచో మరుల్ గొలుపు వలపు
నెఱికొప్పు కెంగేల నిమురనీయనినాన
　　నిమిరిన వలపున నిలుచు ప్రేమ
బిగిపోకముడి నంట విడువనీయని వ్రీడ
　　యెనసిన విడువక మనెడు తమక
మెదను సమముగఁ బెనఁగొన హృద్యమైన
మధ్యమవయస్సుముద్దుగుమ్మయును నేను
నందనోద్యానవనసీమలందుఁ గూడి
పొందికలచేత నానంద మొందు టెపుడొ?

చ. పలుకులలోనఁ బిక్కులొలుక

పానుపునఁ బొలయల్కచిక్కులన్

కలఁకలు దీఱ మ్రొక్కులును గాటపుఁ

గౌఁగిటిలోన సొక్కుల

గ్గలమగుమోవి నొక్కులును

గాముని సాముల నేర్పుటెక్కులన్

గల యల నిండుజవ్వనవుఁ గన్నియ

మిన్నను బొందు టెన్నఁడో.

చ. కలఁగి చలించు ముంగురులు

కర్ణములన్ నటియించు కమ్మలన్

చిలికెడు చిన్నిక్రొంజెమట

చెక్కుల నించుక జారు క్రొంచెవున్

తిలకము నొప్పఁ బొరుషర

తిశ్రమతాంతవిలోలనేత్ర యా

కలికిమొగంబు నెన్నఁటికిఁ

గన్నులపండువుగాఁగఁ జూతునో?

ఉ. ఇంకొకసారి పోయి హరి

ణేక్షణ నిమ్మని వేఁడుకొందునో

పంకగజర్భు నాతఁడు కృ
పారహితాత్మత నీయకుండెనా
కొంకు దొఱంగి జంగ యిడి
క్రూరుఁడు మారుఁడు లీల బాలచూ
తాంకురసాయకానల శి
ఖావళికిన్ శలభంబుఁ జేయఁడే?

ఉ. ఆసరసీరుహాక్షిపయి
నాసల నాసరివారు నవ్వ ను
ద్వాసితధైర్యతన్ విసివి
వాసన వింటివజీరునమ్ములన్
గాసిలుచున్నవాఁడ ననుఁ
గన్నడసేసె విధాత యయ్యయో!
దోసముకాదొకో తనకుఁ
దొయ్యలి నీయక యిట్టు లేచుటల్.

సీ. చాన! రమ్మని మోవిచవిఁ గ్రోలఁగల్గితే
మధులక్ష్మికిఁ కీ పుష్పమంటపంబు
కలికిమోముస మోముఁ గదియింపఁగల్గితే
యబ్జునకును గమలార్పణంబు.

అరవిందముఖకొప్పు నళుమంగఁ గల్గితే
    నీలకంధరునకు నెమలిపించె
కలకంఠిపల్కు లాకర్ణింపఁగల్గితే
    హృద్యవాగ్ద్విజుల కభీష్టఫలము
అలికచకుచంబు లంటంగఁ గలిగెనేని
యేడుకొండలరాయని కేనుభక్తిఁ
గనకశిఖరము లెత్తింతుఁ గంతుకాఁక
తీరుఁగాక! వయారి నన్ జేరుఁగాక!

క. అని యనిశముఁ జింతించుచు
సనురానమునన్ దరంగితాశాశయుఁడై
వనితను మనమునఁ దలచుచు
ననిమిషపతి వెండియున్ మహామోహమునన్.

సీ. మగువపాదములని చిగురుటాకుల నెత్తు
    సఖియూరులని కదళికల హత్తు
సతినితంబంబని సైకతస్థలి వ్రాలు
    చెలువవళులని వీచికలను దేలు
మెల్లఁతయారనుచుఁ దుమ్మెదచాలుఁగనిసొక్కు
    కలికిచన్నులని జక్కవల నొక్కు

పొలఁతి గళంబని పోకబోదియ నూను
　　వెలఁదిమోవి యటంచు బింబ మాను
రమణీనేత్రంబులని చకోరములఁ జూచు
తెలిసి తోడనె విరహార్తి దిగులుఁజెందు
చెలువకొొప్పని నెమ్మికై చేయిఁ జాచు
కందు నందనమందు సంక్రందనుండు.

సీ. ప్రతిలేని చిత్తరుప్రతిమ నీడ్వఁగఁ బోయి
　　ముదిత కాదని యెంచి బెదరి చూచు,
తనసీడఁ గని కౌఁగిటను జేర్పఁగాఁ బోయి
　　మగువ కాదని యెంచి వగచి నిలుచు
మొనసి యింద్రాణితో ముచ్చటాడఁగఁ బోయి
　　మునిరాణి కాదని ముగుద నెంచు
కనుమూయఁ దోఁచురూపును బట్టఁగాఁ బోయి
　　తరుణి దబ్బరటంచుఁ దత్తరించు
రమ్మనుచుఁ జీరుఁ జెంతల క్రమ్మిచేరు
మోహమెదఁగూలుఁ గళఁదేరు ముద్దుఁగోరు
గోరికలమీఱుఁ బలుమాఱు మాటుమాఱు
అమరవిభుఁ డెట్లు ఘనబాధ నట్టెతాఁచు,

ఉ. జాదులు సూదులంచుఁ జెలి
చల్వలు చిల్వలటంచుఁ గప్రపుర్
వేదులు నేదులంచు నెల
నిగ్గులు నగ్గులటంచు రాజకీ
రాదులు వాదులంచు మణి
హారము భార మటంచు నెంచుచుర్
పై దలిపైఁ దలిర్చు తమి
పర్వ సుపర్వవరేణ్యుఁ డుండఁగర్.

ఉ. అచ్చట నాయహల్యయువి
యచ్చరవల్లభురూపసంపదల్
మెచ్చుచుఁ బచ్చవింటిమొకి
మీనిలకోరిక నిచ్చ నొచ్చుచుర్!
నెచ్చెలిచాలు గొల్వ సవ
నీయహుతాశనధూమమండలా
భ్యుచ్ఛ్రయవేష్టితాగము త
పోవనభాగముఁ గాంచె నంతటర్.

సీ. ఉంఛధాన్యసమర్పితోర్వరాధీశార్ఘ్య
మష్టభాగాంకితసైకతంబు

త్రిషవణాప్లుతమౌనిధృతవల్కలాంచల
పృషతచంద్రకవక్షరీతటంబు
మునిబాలకానీతపునరంకురత్కుశ
శ్యామికాకోమలక్ష్మాతలంబు
పృషదాజ్యహేమసమేధమానహుతాశ
ధూమగంధావృతవ్యోమభాగ
మతిథిపూజార్హవస్తుసమార్జనైక
సంగ్రహవ్యగ్రగృహమేధిసంకులంబు
శాంతము నగణ్యపుణ్యనిశాంత మగుచు
శ్రమముల నణంచు గౌతమాశ్రమముఁ జేరె.

క. జలజాతాసనునాజ్ఞఁ
కలకంఠీతిలక మపుడు గౌతమమునికిఁ
చెలఁగి పరిచర్య సేయుచు
ఫలకిసలయకుసుమసమిదుపాస యొనర్పఁ.

క. తాళీహింతాళీకం
కేళీవకుళామ్రనారికేళీకుహాళీ
పాళీఘనకేళీవన
మాళీతతి గొలువఁ జేరె నాళీకముగాఁ.

చ. అళికచ ముంగురుల్ గనిన
　　యబ్జములందలి తేంట్లు దూఱెఁ బో
య్యలిపలుకుల్ వినంగఁ బొద
　　లంతట గోయిలదండు చేరె నె
చ్చెలికుచకుంభముల్ గనుచుఁ
　　జెట్లకుఁ జక్రములెల్లఁ బాఱెఁ గో
మలినడయందముల్ దెలిసి
　　మానసముఁ వడిఁ జేరె హంసముల్.

సీ. అందముల్ త్రిభువనానందముల్ స్మరమూల
　　కందముల్ సరసమాకందము లివె
తుంగముల్ పుషితసారంగముల్ వాసనా
　　రంగముల్ లలితనారంగము లివె
చారువుల్ నవకేసరోరువుల్ భ్రాజిత
　　మేరువుల్ వికసన్నమేరువు లివె
సైకముల్ మధురసానేకముల్ కృతజనా
　　శోకముల్ పుష్పితాశోకము లివె
పొగడ నెగడిన మొగడల పొగడలివియె
తుంటవిలుదంట నంటుల నంటులివియె.

కొమ్మచనుగుమ్మ యొమ్ముల నిమ్మలివియె
కలికి! యీతోఁట చిగురువిల్కానికోట.

ఉ. బాలనిజంబు నీపలుకు;
భాసిలుకొమ్మలు కొత్తడంబులున్
రాలు రజంబు మందు బలు
నారికెడంబులపాళెలున్ ఫిరం
గీ లలపండ్లు గుండ్లు నళి
కీరచకోరమయూరపాళియు
త్కాలబలంబు నైన మరు
కోటయె యీయెలదోఁట చూడఁగన్.

చ. తెలివిరెపొన్నగిన్నియల
తేనియమద్యము లాని సొక్కులన్
గులుకుచు మొగ్గచంటిలత
కూసరుమోవుల నొక్కి ముద్దుకో
యిలపలుకుల్ చెలంగ నల
యింతులపయ్యెద లొయ్యఁ దీయుచున్
విలకపుఁ దావు లంధుచును
భ్రిమ్మరి తెమ్మెర గ్రమ్ముఁ గొమ్మరో!

చ. కుసుమసమూహవాసనలఁ
గుల్కెడు నీలతకూన యొక్కతా
పసతరుఁ జేరవచ్చె నదె
పద్మదళాయతనేత్రి కంటివా
కుసుమసమూహవాసనలు
గుల్కెడు నీలతకూన యొక్కతా
పసతరుఁజేరి యుండుటిది
పద్మజు నానతిఁ గాదె కోమలీ!

చ. అమితమరందతోయముల
నర్ఘ్యము పాద్య మొసంగియుఁ మద
భ్రమరరవంబులన్ గుశల
భాషణముల్ సవరించి వేడ్కతో
గమలజుముద్దుకూఁతురని
కైకొని నిన్ను వసంతలక్ష్మి ప
క్షముదగఁ బూజ సల్పెడు ల
సద్బిసతంతుసహోదరోదరీ!

క. దాడింబపండ్లకై వెస
వేడెంబులువెట్టెఁ జిలుక విరిబోఁణీ, నీ

కోడెచనుగుబ్బగవకై
వేడుకఁ బడి తిరుగు నమరవిభుమదిఁ బోలెన్.

ఉ. అన్నులమిన్న శోకహర
మాట యశోకసమాఖ్యఁ గాంచు నీ
సన్నుతశాఖిరాజమును
సారెకుఁ దన్నెదవేమి న్యాయమే
కన్నులవింటిబోయకును
గైదువు లిచ్చి సమస్తపాంథులన్
మన్నిగొనన్ బలాశి యిది
మన్నన కర్హమటే విలాసినీ!

క. నుడువుచు నీగతిఁ జదలన్
నడుముల్ బిగియంగఁ జుట్టి నారీనివహం
బెడనంతఁ దన్నుఁ బొగడఁగ
నొరిగట్టెను మారుఁ డఖిలయువధృతిహృతికిన్.

సీ. మైనిగ్గుసొంపు సంపగివసంతములచే
బ్రమ్ముతుమ్మెదబారుఁ బాఱఁ దరిమి
సంభ్రమదామోదసహజవాసనలచేఁ
జిలుకల నెల్ల దిక్కులకుఁ ద్రోలి

లోలమానాపాంగ జాలకశ్రేణిచేఁ
బికజాలములఁ బికాపికలు చేసి
నెఱికొప్పు నెఱకప్పునీలాభ్రపంక్తిచే
మదమరాళంబుల నదరఁ దోలి
తావి యుడివోనివిరుల క్షతంబులేని
ఫలములు నచుంబితములైన పల్లవములు
నంచ లంచలఁగలఁచని మంచినీళ్లుఁ
దరుణి యొసఁగంగ మునిపతి తపము సేసె.

ఉ. ఆతరళాక్షియందము మ
హత్తరమా కటిమఁందముః పచో
జాతగళస్మరందము ని
జంబగు నెమ్మెయిగంధముః బెడం
గా తరితీపుచందము మ
హామునిడెందము నొంపదాయె నం
తే తరుణీవిలాసముల
ధీరులచిత్తము దత్తరిల్లునే.

క. ఆనిష్ఠానిధినిష్ఠయు
భూనుతమగు బ్రహ్మచర్యమును గాంచి యజుం

డానాతఁ బెండ్లిసేసెఁ
గానేతరధైర్యఖనికి గౌతమమునికిన్.

చ. సతతము నగ్నిహోత్రపరి
చర్యయు దేవపితృప్రతోషణం
బతిథిసమర్చనంబు మొద
లైన గృహస్థవిధానమెల్లఁ బ్ర
స్తుతమతిఁ జేయు గౌతముని
తోడ నహల్య కృతానుకూల్యయై
స్థితి విలసిల్లఁ గాపురము
సేయుఁ బురంధ్రులు సన్నుతింపఁగన్.

క. వనజాక్షి యిట్టులుండియుఁ
బనిదీరినవేళ నొంటిపాటున బలసూ
దను చక్కఁదనమె తలఁచున్
వనితల నమ్మదురె శివశివా యెంతైనన్.

ఉ. జన్నములందు నింద్రుగుణ
శంసనముల్ విను సాదరంబుగాఁ
బన్నుహవిర్విశేషములు
పాకవిరోధికి నిచ్చు మెచ్చుగాఁ

గ్రన్నన సన్నుతించు శచి
కాపురమే కద కాపురం బటం
చన్నలినాయతాక్షి తన
యందముఁ జూచు శిరంబు నూఁచుచున్.

ఉ. వేళ యెఱింగి కూడి రతి
భేదములన్ దనియించి యల్గినన్
బాళిని బుజ్జగించి రస
భావములన్ గరఁగించునాయకుఁ
డేల యదృష్టహీనలగు
నింతులకున్ లభియించునంచు నా
లోలవిశాలనేత్ర తన
లోపలఁ గుందును వెచ్చనూర్చుచున్.

మ. ప్రమదారత్న మహల్య యింద్రుని మదిన్
భావించుఁ దోడ్తోన ధ
ర్మము గాదంచుఁ దలంచు నెంచినగతిన్
రానిచ్చునా దైవమం
చు మదిన్ వేసరు నిచ్చవచ్చువిభుఁడున్
సొంపొందు టిల్లాండ్ర కే

లమరుంబొమ్మను నాఁడుపుట్టువున నా
హా, పుట్టనౌనా యనుఁ.

గీ. కోరఁదగినట్టి కోరికల్ గోరవలయుఁ
గాని రాయలుగను కలఁ గానసగునె?
పంగుఁడైనట్టి జనుఁడేడ, గంగయేడ?
యొల్ల నీవట్టివెతలని యూరకుండు.

మ. అది యట్లుండె సురేంద్రుఁ డంతట నహ
ల్యాయత్తచిత్తంబుతో
హృదయాంతర్గతచింతతో ననుదినో
ద్రిక్తానురాగంబుతోఁ
గదియంగూడని కాఁకతో నవిజహ
ద్గంభీరభావంబుతో
మదనోన్మత్తనవాతిముక్తశరసం
పాతంబు సైరించుచుఁ.

చ. మదనుఁ డనల్పశిల్పకళ
మాటికి నేర్పుఁగ రాగసంపదల్
కుదురుగ సంఘటించి యవి
కుంఠితభావనపేరితూలికఁ

హృదయపుఁ బల్కయందు నవ
నీరజలోచనరూపవైఖరుల్
విదితముగా లిఖించుచును
లేఖవిభుం డనిశంబుఁ గన్గొనుః.

సీ. అంగతాపముడింద హరిచందన మలంద
నది మేనికాఁకచే నగ్నియయ్యె
శ్వాసవేగ మణంప జలజ మాఘ్రాణింప
నది కంతుసమ్మోహనాస్త్రమయ్యె
తనువుచెమ్మట దీర్పఁ ఘనసారజలమార్ప
నది మారభోగివిషాంబు వయ్యె
నెండ మారటదీఱ నందనవనిఁజేర
నది యసిపత్రవన్యాభ మయ్యె
ముల్లుదీసిన యెడఁ గొఱ్ఱు మొత్తినట్టు
లొకటి సేయంగఁబోయిన నొక్కటయ్యె
నెంతగ్రహచారమో నిర్జరేంద్రునకును
మకరకేతుమహాదశ వికటమయ్యె.

సీ. మందారవనికేఁగు మందారవనిలోన
నెంద మానందంబు నొందకున్న

మందాకినికి నేఁగు మందాకినీతటి
మారజ్వరనిదాఘు మారకున్న
మందరగిరి కేఁగు మందరగిరియందుఁ
బొందికగాఁ బ్రొద్దుపోవకున్న
బిందుసరసి కేఁగు బిందుసరస్సులో
నారాటమింతేనిఁ దీఱకున్నఁ
బుడమి కేతెంచి గౌతమమునివరేణ్యు
నాశ్రమంబున కేఁగి యహల్యమేని
కమ్మనెత్తమ్మి సెత్తావి గాడ్పు సోఁకఁ
గొంతవిశ్రాంతిఁ గనికోరి కుధరవైరి.

ఉ. ఒక్కొకవేళ వచ్చి పురు
హూతుఁడు జాఁగిలిమ్రొక్కి జాళువా
చక్కని కమ్మతమ్మి కవ
చానపదంబుల నంటునట్లుగా
మక్కువ మానికిచ్చు ముని
మానిని కిచ్చు వధూటి నవ్వు లేఁ
జెక్కులఁ దోఁపఁ గన్నుఁగవఁ
జేరును నాతనికేలు మాటుగన్.

చ. ఎవరది యింటిలోపల? స
దెవ్వరు? శక్రుఁడ; చెల్ల! మీరలా,
యివలికి రండు; నీదుమగఁ
డెక్కడ? మూలఫలార్థమేఁగె; రా
నువిదరొ, తామసంబగునొ?
ఉండుఁడు, పూజలు గాంచిపొండు; సే
యవలయు పూజ నీ వెఱుఁగ
వా? యన సిగ్గున నేఁగునవ్వుచున్.

మ. మునితో నింద్రుఁడు మాటలాడునపు డం
భోజాక్షి కీలందె గ
ల్లన మైజల్లన మాట తోఁపక వితా
కై యుండఁ దద్భావమున్
గని యాజవ్వని సిగ్గు ప్రౌఢిమయు శృం
గారంబు లేనవ్వులున్
మొనయంజూచు నతండు చూచిన మర
ల్చున్ జూపు వేఱొక్కెడన్

ఉ. ఈనళినప్రవాళములు
నీకదళీతరు లీమహీస్థలం

ఘనడబావి యీఖగము
లీలత లీక్రముకాభిరూప్యమీ
భూనుతసోమలక్ష్మిశ్రయు న
పూర్వములంచు నుతించు వాసవుం
డానలినాక్షిచక్కఁదన
మాశ్రమవర్ణనగా మునీంద్రుతోఁ.

ఉ. రంగదభంగవైభవము
రాజిల యజ్ఞములందు సభ్రమా
తంగము నెక్కి యింద్రుఁడు త
దాశ్రమవీథిని వచ్చుచోఁ జెలిఁ
ముంగటఁ జూచి కన్నులను
మ్రొక్కి మనస్సున గౌఁగిలించు స
య్యంగన రెండునుంగని య
నంగుఁడు పువ్వులువైచు కత్తికిఁ

క. ఈగతి నింద్రుఁ డహల్యా
రాగతిరస్కృతశచీపురంధ్రీరతివై
ద్రాగతివేలకృతస్వ
ర్భాగతివై తిరిగె నాసుపోసిన రీతిఁ.

ఉ. కౌస్తుభచారువక్ష సిత
కంజదళాక్ష కళిందకన్యకా
నిస్తులనీలవర్ణ కమ
నీయ చరాచరమాననీయ ప
ద్మా స్తనకుంకుమాంకనవ
మండన దానవదర్పఖండనా
కస్తురిరంగ రంగపుర
కైరవపూర్ణకురంగలాంఛనా!

క. కుందారవిందసుందర
మందారసుకీర్తిహార మహితవిహారా
వందారుజనాభీప్సిత
బృందారకరత్న సమరభిన్నసపత్నా!

మత్తకోకిల

చంద్రపుష్కరిణీతటాంచల చారచారణసన్నుతా!
మంద్రనీరదమాలికాసుకుమార మారశరోపమా!
సాంద్ర సత్కరుణానవామృతసార సారసలోచనా!
ఇంద్రచంద్రదినేంద్రముఖ్యసురేశయూథవిభాసితా!

గద్య.

ఇది శ్రీ పాండ్యమండ లాధీశ్వర శ్రీ విజయరంగ
చొక్కనాథ మహీనాథ కరుణాకటాక్ష సంపా
దిత గజతురంగమాందోళికా ఛత్రచామర
విజయదోహళకాహళభూరిభేరీబిరుద
ధ్వజప్రముఖ ఖిల సంపత్పారంపరీ
సమేధమాన సముఖ మీనాక్షి
నాయకతనూభవ శ్రీమీనా
క్షీదేవీకటాక్షలబ్ధకవితా
సాంప్రదాయక వేంక
ట కృష్ణప్పనాయక
ప్రణీతంబైన య
హల్యా సంక్రం
దనంబను మహా
ప్రబంధంబు
నందు ద్వితీ
యాశ్వా
సము.

శ్రీ

# శృంగారాహల్యాసంక్రందనము

## తృతీయాశ్వాసము

శ్రీ తరుణీనయనోత్పల
శీతమయూఖాభిరామ శ్రితజనవాంఛా
జాతప్రతిపాదన చణ
చేతోవ్యాపారనిరతి శ్రీరంగపతీ!

వ. అవధరింపుము.

క. శ్రీయుతుఁడగు జనమేజయుఁ
డాయతమతి నవలికథల నడిగిన మదికిం
హాయి దలిర్పఁగ వైశం
పాయనుఁ డిట్లనియె లోకపావనచరితా.

క. ఇటులుండ నొక్కనాఁ డా
కుటిలాలక కడుకు వచ్చెఁ గొంకక ఘటనా

ఘటనాకోవిదమతియగు
జటిసీమణి యోప్తు లలితసత్వరగతియై.

చ. పదముల యోగవాగెలును
బాణితలంబున నాగబెత్తముల్
నుదుట విభూతిరేఖయు మ
నోజ్ఞకటీతటిఁ గావిచీరె పో
బొదివినయట్టి యొక్కమొగ
పుల్ రుదురాకలదండ సందిటన్
వదనమునన్ మృదుస్మితము
వర్తిలు యోగినిఁ గాంచి భక్తితోన్

క. వందన మొసర్చి పూజల్
పొందికగాఁ జేసి పీఠమున నునిచియు బా
లేందుముఖ యెందుఁ బోయెద
వెం దుండుదు విందు వచ్చుఁ టేమి యటన్నన్.

ఉ. ఉందును సత్యలోకమున
యోగబలంబున నెల్లదిక్కులన్
గ్రందుగ సంచరింతు శశి
ఖండకిరీటికిఁ దద్వధూటికిన్

మందరధారికిఁ రమకు
మాటలబోటికి నవ్విరించికిఁ
పొందికలం దెడాటములు
పుట్టిన మాన్పుదు వారు మెచ్చఁగన్.

క. నందనవని నిన్నఁ సం
క్రందనుఁ గనుఁగొంటి నతనిఁ గనినంతనె నా
డెందము భగీలుమనియెన్
దందడిఁబడు వానిదీనదశ యేమందున్.

సీ. నిబిడోష్ణనిశ్వాసనికరంబుచేఁ గల్ప
వనవాటి తాపించవన్నె గాఁగ
కల్పానలాకల్పకందర్పవహ్నిచే
నెసఁగు విన్వాక యిట్టింకులింక
ధారాళ నేత్రాంబు ధారాతివృష్టికి
జలదసందోహ మాశ్చర్యమొంద
నత్యంతకఠినదీనాలాపములచేత
వజ్రమేనియు గుండెపగిలి యెడల
కరుణయెల్లఁ బుమాకృతిఁ గాంచినట్లు
విరహతాపంబు మూర్తిభవించినట్లు

తలఁచి పలుకంగరాని దుర్దశలఁబొందు
మఘవు నే నందుఁగనుఁగొంటి మచ్చెకంటి.

ఉ. ఎవ్వతెమీఁదనో హృదయ
మీభువనత్రయనాథునింతగా
రవ్వలఁబెట్టినట్టి యల
రక్కసి యెవ్వతో చూతమంచు నే
నవ్వనమధ్యకుంజకుహ
రాంతరసీమ నణంగియున్నచో
నవ్వలశాసనుండనియె
నవ్వల నవ్వలమాన వేదనన్.

ఉ. ఏలసృజించె దాని నను
నేలసృజించెను బ్రహ్మదానికీ
లాలితరూపయౌవనక
ళాలలితాంగవిలాసవిభ్రమం
బేల నొసంగె? బేలతన
మేటికి నిచ్చె? మదీయబుద్ధికిన్?
బాలికతోడ నామనవిఁ
బల్కెడువారి జగానఁ గానఁగా.

మ. కలలోఁ జూతునటన్న నిద్ర యెఱుఁగన్
గన్నారఁ జిత్తర్వునన్
దెలియం జూచెదనన్న బాష్పములచే
నేత్రాబ్జముల్ క్రమ్మెడిన్
కలయన్ ధ్యానముఁ జేతునన్న మది ను
న్మాదంబు సంధిల్లెడిన్
ఇలలోఁ బాళఁగరానితాప మహహో
యెట్లోర్చెదం దైవమా!
చ. కులుకుటొయారపున్నడలు
గుబ్బచనుంగవ గొప్పకన్నులన్
తొలుకరిక్రొమ్మెఱుంగుగమి
తోఁ గమితోపమమైన మేనితో
నలయలివేణి లోవెలి న
హర్నిశమున్ గనుపట్టుచుండెనున్
జలగత చంద్రమండలము
చాడ్పునఁ జేతికి నబ్బ దక్కటా!
మ. ధనికున్ జేయును లోభివాని నెఱదా
తన్ బేదఁగాఁ జేయు ర

త్యనభిజ్ఞుండగు నేడ్తెఱన్ మదనతం
త్రప్రౌఢయౌదాని భా
ర్యనుగాఁజేయు నటన్నకోపమునఁ గా
దా బ్రహ్మశీర్షంబు ద్రుం
చెను శంభుం డటుగాన వానికి నసౌ
చిత్యం బిలన్ జెల్లునే?

క. అని పలికి చిత్రఫలకం
బునఁ దనభావమున నున్నముద్దులగుమ్మన్
దనువునఁ బులకలమొలకలు
పెనఁగొనఁగా వ్రాసి చూచి పేరెద నునిచెన్.

క. ఆరూపము నీరూపము
సారూప్యముఁజెంది యుండె జలజదళాక్షీ!
మారుఁడు స్వైరవిహారుఁడు
వీరినివారని మదిన్ వివేకములనుచున్?

ఉ. మోవిని మోవిఁ జేర్చు నది
ముద్దిడకున్నను మ్రొక్కుఁగేల ని
చ్ఛావిధిఁ గౌఁగిలించు నది
చన్నులనొత్తమి వెచ్చనూర్పుఁ జే

సీవిక నంటు హ త్తమికి
    నెవ్వగఁ బొర్లును బూవుఁబాన్పుపై
దైవముఁదిట్టుఁ దిట్టుకొనుఁ
    ద న్ననుఁ దిట్టును బెట్టుమూర్ఛిలున్.
చ. యమవరుణాదు లెవ్వనిక
    టాక్ష మపేక్ష యొనర్తు రాగమా
గ్రములు యదీయరూపగుణ
    కర్మము లెన్నను వందినైఖరిన్
హిమకరసోదరీరమణుఁ
    డెవ్వని వాకిటికార్యకర్త యా
యమరనరుండు కోరె నిను
    నంగన, నీదగుభాగ్య మెట్టిదో!
చ. కొసరులొ చెక్కు నొక్కుటలొ
    కూకిరవల్ పలికించి పల్కుటో
యొసపరియల్కలో నయము
    లో రతిసుద్దులొ వింతముద్దులో
పసఁ దొడసందుపొందికలొ
    వా తెరమార్పులొ ప్రక్కమార్పులో

రసికత లేని గేస్తురతి
రామకు నేమిసుఖంబు దెల్పుమా!
చ. వ్రతములఁ గృచ్ఛ్రకోటి నుప
వాసములన్ దనువుల్ కృశింపఁగా
మతి నరతిన్ శిరోవృతిని
మౌనముతో మొగమోరగా వడిన్
పితరులయప్పు దీరెనని
పింతురు యౌవనమత్తకాశినీ
తతిహృదయంబు నేచుబలు
తాపసులన్ బసులంచు నెంచుమా!
సీ. నేఁటి కమావాస్య నేఁటికిఁ బున్నమ
నేఁటికి సంక్రాంతి నేఁడువిషువు
నేఁడు వ్యతీపాత నేఁటికి వైధృతి
నేఁటికి మన్వాది నేఁటికిఁ దిథి
నేఁటి కేకాదశి నేఁటికి ద్వాదశి
నేఁటికి శివరాత్రి నేఁడు వ్రతము
నేఁటికి ఋతుకాలనియమంబుదప్పెను
నేఁటికిఁ బోనిమ్ము నేఁటి కోప

మనుచు దినములు గడపుచు నలసులైన
పాపజాతులు పెండ్లాడి పాలవంటి
వయసు వమ్మొనరింతురు వనితలకును
బుడమి నిల్లాలిపుట్టుక పుట్టనగునె?"

చ. అనుటయు నర్మకోపదర
హాసవిలాసలసన్ముఖాబ్జయై
యనియె నహల్య యిట్లనుచు
"నమ్మకచెల్ల! యిటాడఁ జెల్లునే?
నను నటువంటిదానిఁగ మ
నంబునఁ నెంచెదో యెంచకున్న నీ
యనువున నందువా యెఱుఁగ
వా మగువా, నను నాదుచిత్తముఁ.

ఉ. ఎవ్వరి నేను మున్నుమొగ
మెత్తి కనుంగొనఁ జూచినావు! నే
నెవ్వరి చెంగటన్, నిలిచి
తెవ్వరితో నగి, తేమిచేసితే
నెవ్వతె నింద్రుఁ డెవ్వఁడు బ
ళీ! నను బోటికి నిట్టిసుద్దులా

ఇవ్వని మూలనున్ననను
నేటికి ముంగిటి కీడ్చెదే చెలీ!

ఉ. వేది యలంకరించుటయొ
వేల్మి కమర్చుటయో హవిస్సులన్
బ్రోదిగఁ జేయుటో కుసుమ
ముల్ గొని తెచ్చుటో దేవపూజ క
గ్రోదకమాహరించుటయొ
యుగ్మలి, మా కిటువంటి నుద్దులీ
బోదలరానఁ గాను ననుఁ
జుల్కనఁగా నెదలోఁ దలంపకే."

గీ. అనిన మోగిని మెల నగవంకురింప
"ఘనకచవు శైలకుచవు సైకతనితంబ
వేను నినుఁ జుల్కఁగానెంతునే మృగాక్షి!
పంచకన్యలలో నెన్నఁ బ్రముఖవీవు.

ఉ. ఎంతతపంబు సేసిన మ
రెంతపతివ్రతనిష్ఠ నున్నఁదా
నెంతకృశించినన్ వ్రతము
లెన్ని యొనర్చిన నెన్నిపుణ్యాతీ

ర్థాంతరముల్ చరించిన నొ
యారికి రూపవిలాసవంతుఁడౌ
కాంతునిఁ గౌఁగిలించిన సు
ఖంబు లభించునటే విలాసినీ!

ఉ. ఎందును సంచరింప కఖి
లేంద్రియముల్ సుఖమొంద డెందముల్
బొందుగఁ దన్నుఁదామఱవ
బుద్ధి కగోచరమైనయట్టి యా
నందము బ్రహ్మ మందు రది
నవ్యవయోనవమోహనాంగియౌ
చందనగంధికిన్ దొరకుఁ
జక్కనిమక్కువకాఁడు చిక్కినన్.

ఉ. చేతన మాటయే యరిది
చేతనమైన మనుష్యజన్మ మ
త్యాతతపుణ్యలభ్య మటు
లైనను స్త్రీజననం బలభ్య మా
జాతికిఁ గామముల్ సురత
సౌఖ్యము హెచ్చది పోవఁద్రోచినన్

పాతక మాత్మహత్యకు స
మం బగుపాతక మొక్కటున్న దే.

సీ. కాంతుదంతక్షతిఁ గాంచని మోవియు
మోవియే చల్లమ్ము మోవిగాక

*　*　*　*

ప్రాణేశుఁ డనుభవింపని యౌవనమ్ము యౌ
వనమ టే నిజమ యవ్వనము గాక
పతిమేన మకరికల్ వ్రాయనివేళ్లును
వ్రేళ్ల టే కలజువ్వి వేళ్లుగాక
చంద్రకిరణమ్ము సోఁకిన చంద్రకాంత
మనఁగఁ బదియాఱుకళల జిమ్మనికరంగు
కరఁగి కరఁగించి కాంతునిఁ గవయకున్న
నారి నారియ టే వింటినారి గాక.

ఉ. ఏలనె జాలి సర్వజగ
దీశ్వరుఁడైన సురేశ్వరుండు ని
న్నేలఁ దలంచె మేలు గన
వే వినవే యరచేతికబ్బు లి

. . .

బ్బేలను బేలనుం బలెబ
లే పలుకందొరకొంటి వైన నీ
కీలు నొకిం తెఱుంగుదు వ
కీలొనరింతు వికీలు వేటికే?

చ. చిలుకలకొల్కి, నీసొగసు
చిత్తరువందునఁ జూచి కన్నులన్
బలపల నీరునించి తల
వంచి తలంచి భ్రమించి మించిహా
వలపుల కేమిసేతు సని
ప్రార్థనచేయు నుమామహేశులన్
బలరిపుఁ డమ్మహామహుని
భావ మదేమి యెఱుంగఁబల్కవే?"

క. అనిన సహల్య నొకించుక
నునుజెక్కుల నవ్వుదోఁప నూల్కొన నీకన్
అనుఁ దాననుతాపనతా
ననతావనతాంగి యగుచునవమధురోక్తిన్.

సీ. "స్వర్ణచిత్రవిచిత్రవర్ణమందిరములా
యాపర్ణసతసంబు లింద్రునకును

సురసిద్ధసాధ్యభాసురదివ్యవీథులా
యీయాశ్రమంబు దేవేంద్రునకును
వరకల్పనాకల్పకరకల్పతరువులా
యీవృక్షములు నందనేశునకును
పటుదాన సందానబహుమానగజములా
యీమృగావళులు మహేంద్రునకును
రమ్యసౌందర్యవరకళాప్రౌఢిమలును
గలిగి చెలఁగినయింద్రాణిఁ గాను నేను
ప్రేమ నాపైని శక్రుఁ డేరీతిఁ బూనుఁ
గ్రొత్తవలపులు వలవరే కుతలపతులు.

సీ. రంభకై వడిఁ గంబురాగుల్కుపల్కులో
తమిఁగూర్చువలపులో తారరీతి
నూర్వశిచందాన నొరపొందుచిన్నెలో
రక్తిఁగుల్కుటొ మదాలసవితాన
శశిరేఖయందాన సకలకళాప్రౌఢో
యెదురొత్తులిచ్చుటో హేమలీల
మంజుఘోషనిరూఢి మణితానుకూల్యంబో
మానలీలలొ ఘృతాచీమాలినివలె

నెజేఁ దిలోత్తమగతి నతిస్నేహగరిమ
నెనయుటో నాగరికరీతి యింతలేని
తపసియిల్లాండ్రపై బాళిఁ దగిలి మిగుల
పగలఁ జెందుదురే తమవంటిదొరలు.

క. సతికిఁ గామును జేపట్టిన
పతి నొక్కరుఁ దక్క నితరుఁ బాటించుట సం
గతియట వే నీ కెంతటి
మతిదిటవే యిట్లు నుడువ మర్యాదటవే?"

ఉ. నావుడు యోగినీరమణి
నవ్వుచు నెచ్చెలికొప్పు దువ్వుచుఁ
నావచనంబు వేదవచ
నంబని యెన్నము బొంకెఱుంగనే
నీవు జనించినప్పుడె సు
రేంద్రుఁడు నీదగు చెట్టఁబట్టి నాఁ
డీవిధి యాను గాదనిన
నీవె మునీంద్రుసిచే నెఱుంగుమా!

క. అది సూక్ష్మరూపమంటే
నిది యాతనిస్థూలరూప మిదియదివేఱా!

మదనాశుగసదనాయిత
హృదనాగతధైర్యవమ్యె దేలా బాలా!
క. రాజీవాక్షి, 'యహల్యా
మై జార' యటంచు నాగమాగ్రస్తుతుఁడౌ
నాజిష్ణునెనయవే, యో
షాజారమిదంప్రియ' మనుచదు వెఱుఁగవటే!"
క. జటినీమణి యిటులాడిన
కుటిలాలక యింద్రు నెనయుకోరిక వొడమన్
దటుకునఁ బలిభయ మెసఁగఁగ
నటునిటు నన లేక శబలితాశయ యగుచున్.
ఉ. కూరలు కందమూలములు
కూళ్లు తలంటులు గారనూనె మా
చీరలు నారపట్ట కయి
చేయుట మాకులమందె లేదు కాం
తారమునన్ జరించుట తృ
ణంబులమీఁదఁ బరుండుటల్ మముం
గోరెడువారలుం గలరె
కోమలి, నీదువివేక మేమనన్.

చ. మదనుని గుమ్మితీమొనలు
మాటికి మర్మములంటఁబాఱినన్
వదలనికోరికల్ మొలిచి
వర్ధిలి డెందమునందె డిందినన్
హృదయము ఱాయి చేసికొని
యింపు దలంపక యుండఁగాఁ దగన్
గదలఁ దరంబె యొక్కనికిఁ
గంతము జూపిన కంబుకంఠికిన్.

ఉ. అద్దములోనఁ దోఁచు ముదు
పందనిమ్రానిఫలంబు కోపపున్
గద్దరిచిల్వ చేఁబడిన
గందపుఁదీవె మహావిషంబులో
సద్దినపణ్ణారంబు మగ
నా లది కొంచెమునన్ లభించునే
సుద్దులు వేయునేల బల
సూదనుతోఁ దెలియంగఁబల్కవే.

సీ. చక్కనివాఁ డింటిచాయకు వచ్చిన
మామగా రూరక మండిపడును

పుట్టింటిలో నొక్కపూట యుండఁగ రాదు
కత్తికోఁతఁగఁబోరు నత్తగారు
నిమిషంబు పొరుగింట నిలిచియుండగ రాదు
పటుకార్లఁ బట్టునువదినగారు
కడకుఁబోయిన నొక్కకడ నుండఁగారాదు
మఱఁదలు కొండేలమారిబసివి
తోడికోడండ్రు చూపోప కాడుకొండ్రు
పట్ట పగబట్టి పోరాడు బావగారు
జారసంగతిఁ గాంక్షించు చంద్రముఖికి
నత్తగారిల్లె కారాగృహంబు దలఁప.

క. భావమున నేమికిటుకో
నావంకనె చూచుచుండు నామగఁడెపుడున్
రావశమో పోవశమో
యీపని కెవ్వానికైన నిందునిభాస్యా!

క. కాదని నీమొగమోటకు
నేదయినన్ మంచి దంటినేనియు రతికే
లీదక్షు నతని నెప్పఁడు
మేదిని మెప్పింపనేర్చు మేలిమితోడన్.

క. తారాపథూటి యొక్కతె
తారాపతి యొక్కరుండు ధన్యులు జగతిన్
వారివలె సాహసింపఁగ
నేరికి శక్యంబు మగల కింతులకైనన్.

క. నామనవిగఁ దనపై నీక
నీమమతలు మానుమనవె ఎవ్వరి కెవరే
కాముచెతల్ నావలె సు
త్రాముని సైరింపుమనుము తామరసాక్షీ!

ఉ. చుక్కల జేనిఁ గంతుని ను
చుక్కను చక్కదనంబుగల్గు మా
చక్కని సామి పాదజల
జాతము లాదలఁ జేర్చి మ్రొక్కితిన్
చిక్కఁగఁ గౌఁగిలించితిని
సేమము వేఁడితి నేడనున్న నీ
ప్రక్కనె యున్నదాన నని
భావమునన్ నెనరూనఁబల్కవే.

సీ. తనగుణంబులు విని ఘనమైన పులకలఁ
గడిమిపూవులగు త్రికరణినుండు

తనరూపు భావించి తనరిన చెమటచే
మధుసిక్తపద్మినిమాడ్కి నుందు
తన విలాసము నెంచి దర్పకజ్వాలచేఁ
గనకశలాకనఁ గరఁగుచుందు
తనపొందికఁ దలంచి తనువెల్ల జల్లనఁ
జిత్రార్పితాభసిశ్చేష్టనుందుఁ
జేతనంబయ్యు నేను నచేతనముల
సరణి విరహాఖ్యకల్పావసాన జలధిఁ
జేత నీఁదుచుఁ బారంబుఁ జేరఁగాన
ధరణి మగనాలికంటెఁ బాతకియుఁ గలదె?

మ. విరులెల్లన్ ప్రదరంబులయ్యె విధురు
గ్వీచుల్ దలంపంగ బం
ధురహేతిప్రకరంబులయ్యె నళిసం
దోహంబులెల్లన్ భయం
కరదుర్వారశిలీముఖ ప్రతతులై
కన్పట్టె నేదిక్కులన్
మఱఁడయ్యెన్ సుఖ మెప్పుడో కలుగుటల్
నాతాపముల్ దీఱఁగన్.

సీ. ఎన్నఁటికోకదా యెమ్మెకాని కరంబు
లెత్తి నాకన్నుల నొత్తుకొందు
నెన్నఁటికోకదా హృదయేశుసందిట
నివ్వటిల్లెడు ప్రేమఁ బవ్వళింతు
నెన్నఁటికోకదా పన్నెకానియురంబు
గబ్బిగుబ్బలఁ గ్రుమ్మి కౌఁగిలింతు
నెన్నఁటికోకదా యేలినసామికి
నందపువాతెఱ విందొనర్తు
నెన్నఁడోకద వగకాని కింపుమెఱయఁ
.........వింతలుగానుపించి
హావుసు చెల్లింతుఁ జెలులలో నతిశయింతు
ననుచు నేనుందు నీయాన హంసయాన!

గీ. ఏఁబరాధీనఁ గావున నింతవంతఁ
గ్రాఁగుచుండంగవలసెను గాకయున్న
నెఱకలను గట్టికొనియైన నెగసివచ్చి
తనమెదను వ్రాలనా చిల్కతాళివలెను.

ఉ. భారములాయెనమ్మ కుచ
పాళికి హారము లేమిసేతు ని

స్సారము లాయెనమ్మ ఘన
　　సారము మన్మథభూతభీమహాం
కారము లాయెనమ్మ కల
　　కంఠనినాదములమ్మ చెల్ల, నా
ధారము లాయెనమ్మ పరి
　　తాపభరంబులకెల్లఁ బ్రాణముల్.

ఉ. పట్టఁగరాని మోహమునఁ
　　బైకొని తోఁచినవెల్లఁ బల్కితీ
మట్టునఁ గట్టిపెట్టు మిది
　　మానసమంచె ధరిత్రిలోపలన్
పుట్టని యట్టిబిడ్డలకుఁ
　　బూసలు గట్టుదు రమ్మలక్కలే
గుట్టున నుండుదాన నతి
　　కోపనుఁ డింటిగృహస్థు యోగినీ!

క. నాతల్లి నీవు నీతో
నాతలఁపేమిటికి దాఁచ నాతీ, మాయిం
టాతఁ డెపుడైనఁ గలసిన
నాతనిఁగాఁదలఁతు ముకుళితాక్షిద్వయనై.

గీ. అగ్నిహోత్రాలవే ళామెనమ్మ! నీవు
పోయిరమ్మని పంపి యాపాలంతియుండ
సంభవించును దోషాధికార మింక
గనుఁగొన ననర్హమని సూరికన్ను మొగిచె.

సీ. కరిఘటాహాలిపటాశరభటా యసకటా
హములసైల్యము పొంత నణఁగఁద్రొక్కి
హరిశిలాభరజలాకరపికార్భకకులా
మితకాంతిసంతతి మితము చేసి
ఉరగరాడ్గరదురాధరధరామితశరా
సితరుచిప్రాచులచేరి చేరి
అళివిభాసురవిభాహరివిభాతులితభా
సంతతాభ్యుదయముల్ సంతరించి
యినసుతాసింధతాపింఛవసదనికర
ఖంజనాంజనగిరి నీలకంజపుంజ
జంబుకాదంబసైరిభాడంబరములఁ
జాండవించెను దమము భూమండలమున.

చ. తెలుపును నల్పుదిక్కులు వి
దిక్కులు మేరునగంబు సర్షపం

బిలయు నభంబు దూరము స
మీపము హ్రస్వము దీర్ఘమన్న సం
జ్ఞలు గల సృష్టినేమిటి కొ
నర్చితి నంచు విరించి యెంచఁగాఁ
బ్రళయపయోధు లొక్కమొగిఁ
బర్విన టుల్ వెసఁబర్వెఁ జీఁకటుల్.

చ. మదననిదాఘతాపముల
మాన్చు ఘనాఘనసంఘమో యనన్
గదిసె మహాంధకారములు
కాంతగవేషణతత్పరాత్ములై
కొదుకుచు సందులన్ దిరుగు
కొమ్మలు బెళ్కుమెఱుంగు లై రిలన్
వదల నిహర్షమయ్యె నిశి
పాంథజనంబులకున్ దురంతమై.

గీ. తాపము లణంగె భూతసంతతు లెసంగె
నతనుధర్మపరిస్ఫూర్తు లతిశయించె
నుత్తమస్థితిమించెను నుత్తమముగ
ఖరకరాభావమే శుభంకరము ధరను.

చ. ఒకమగనాలు మాఱువఁగఁ
దుండని కేల మెఱుంగకే తమో
వికలత నొక్కఁడన్ నిలువ
వేఱొకతంచుఁ దదీయభర్త యా
సకియనె కౌఁగిలింప నది
జారుఁ డటంచును జారయంచుఁ దా
రొకరొకరిం దమిం గలిసి
రుద్ధతి మన్మథుఁ డుబ్బి యార్వఁగన్.

చ. నెడవిలుకాని వేదనల
వేఁగుచు దుర్విటు లేఁగఁ జీకటిన్
గుడిసెలు పంచలున్ వెడలి
కుంటియు గ్రుడ్డియు భుగ్న రుగ్ణము
ట్లుడిగినయింతి మున్నువల
మోత్కరశబ్దనివేదితాత్మలై
బడిబడిఁ బైఁడిఁదీసిరి త
మం బఖిలోత్తమమంచు నెంచుచున్.

ఉ. కప్పులకప్పడంబులును
గస్తురిపూఁతలు చాలు నిప్పుడే

చొప్పున నేఁగిరన్ మనలఁ
జూడఁగలండె త్రిణేత్రుఁడేనియున్
ముప్పదినాళ్లు నీదృశత
మోవృతి సేయఁగరాదె బ్రహ్మయం
చప్పెనుచీఁకటిన్ వెడలి
రారటమై కులటల్ తటాలనన్.

క. ఆయామవర్తి మునివరుఁ
డాయామము నిగమసంహితాభ్యాసకృత
వ్యాయామశ్రాంతమతిన్
సాయామతరుచ్ఛదాస్తృతాజినశయ్యన్.

మ. పవళింపన్ రమణీశిరోమణి రతి
ప్రారంభసంరంభతన్
ధవుపాదంబులు పట్టి యొత్తెడువితా
నన్ గోరు సోఁకించినన్
"నవలా, నీదుచెఱంగుమాసి పదియార్
నాళ్లామెఁ గాలంబు ద
ప్పె వృథాదోషమిదేల మాను" మన న
వ్వేళన్ విలోలాత్మయై.

క. 'త్రిదశాధిపుఁడై తేఁ గద
యద వెలుఁగుచుఁ గోర్కెఁ దీర్చు'నని తనలోనన్
మదనాశుగ మదనాశుగ
మదనాశుగఘాటి కదిరి మానినిమునితోన్.

శా. "ఔలెం డంతకుమున్నె మాకుఁ బనిలే
దాచోదనే; నిద్రపై
బాళిన్ మీపదమూలమందు శయనిం
పన్ వచ్చితిన్ జోలి చాల్
చాలుం బో"మ్మని యల్క మాఱుమొగమై
చంద్రాస్య నిద్రింప న
వ్వేళన్ శాంతమహార్ణవం బనఁగ సం
వేశించె నమ్మౌనియున్.

వ. తదనంతరంబ.

ఉ. యోగిగతిన్ సురేంద్రుఁడును
యోగ మొనర్చి తదీయసూక్తిపై
యోగజరాజగామిని వి
యోగదశన్ విని దాని చాతురీ

యోగము మెచ్చి కంతుని ని
యోగము నౌదలఁ దాల్చియంత సం
యోగము సాహసక్రియఁ బ్ర
యోగముసేయఁగఁగూడ దక్షమతిన్.

గీ. కోడిగపుఁ గంతుయాతన కోడి వజ్రి
కోడియై కూసెఁ "గొక్కొ_రోకో" యటంచు
మౌని మేల్కని వామన స్మరణ దనరఁ
గాల మరయక మునుగంగ గంగకరిగె.

క. గౌతమవేషమున బెడం
గా తమకము మీఱ నిర్జరాధీశుఁడు బా
గా తమమునఁ జేరం జని
గౌతమసతికరముఁ బట్టె కౌతుకమెసఁగన్.

గీ. "కొమ్మ యొకపుంజు తన పెంటికోడిఁదలఁచి
కూసెఁగా కది వేకువకోడిగాదు
ప్రొద్దు వొడువంగఁ దద్దయుఁ బ్రొద్దుగలదు
ముద్దుగా శయ్య కరుదెమ్ము ముద్దుగుమ్మ!"

చ. అనిన నహల్య శంక మది
నంకురమందఁగ మందహాసయై

యనిమె 'మునీంద్ర వేషమున
 నాశతమన్యుఁడో కాక యన్యుఁడో
ననుఁ జెనకంగవచ్చె ముని
 నాథుఁడు గాఁ'డని ప్రేమయున్ భయం
బెనయఁ గరంబుఁ దీసికొని
 యిట్లనియెన్ గిలికించితంబుగన్.
చ. "రతిపతి యంపఱంపముల
 రంపునఁ గంపమునొంది నేను మున్
రతికయి వచ్చి మచ్చిక లొ
 నర్చినఁ బేర్చినచర్చ 'నొప్పునే
ఋతుదివసంబు దప్పెఁగడ
 కేఁగు మటంటి విదేమి'యిప్పు డీ
గతి బతిమాలె దెవ్వఁడవొ
 కల్లలుచెల్లవు పల్కు"నావుడున్.
గీ. "అలశతానందగురుఁడు గోత్రాధికారి
పరుల శతకోటియుక్తుల భంగపఱతు
నాత్మభూసన్నిధిని నీకరాంబుజంబుఁ
గాంక్షఁ బట్టితి నన్నెఱుంగవె మృగాక్షి

చ. అతివల జాతిచేష్టితక
　　ళాస్పదమర్మవిభేద భేదియై
జతనగు జవ్వనం బుడిగ
　　జాఱకమున్నె యభీష్టభోగముల్
ప్రతిదివసంబుఁ జెందకయె
　　బాలిశుఁడైన జనుండు పిమ్మటన్
గతజలసేతు బంధనము
　　గాఁ దలఁచున్ విషయోపభోగముల్.

క. ఋతుకాలదినములైనన్
ఇతరదినములైన మఱియు నేదినమైనన్
వితసేయక రతికేళీ
వ్రతియగుకృతికఘమురాదు వనితా" యనుచున్

క. శ్లేషార్థము దెలిసి నిజా
శ్లేషార్థము వచ్చె నలశచీపతి యనుచున్
యోషారత్నంబు తదా
భాషణకౌతూహలాను భావాన్వితయై.

ఉ. "నాపయి నింత ప్రేమ ముని
　　నాథున కెన్నఁడుఁగానఁ గావునన్

నాపతి వీవుగావు కుహ
నాకృతి వెవ్వఁడవో యెఱుంగ నీ
రూపముఁ జూప కూఱక మ
రుల్గొని బల్మి యొనర్చి తేని నే
నైఁప నిజంబు పల్కు మిఁకఁ
జల్లకు వచ్చియు మింత దాఁతురే?"

చ. అనుటయు జాళువామినుకు
టంచులదుప్పటి వల్లెవాటుతో
ననుపమతారహారకట
కాంగదముఖ్యవిభూషణాళితో
ఘనఘనసారసంకుమద
కల్పకమాల్యకదంబకంబుతోఁ
గనఁదగివొర్చె శచీవిభుఁడు
కంతుపసం దగతిర్చ నిజాకృతిన్.

ఉ. ఆలలితాంగి యాసుమచి
రాంగునిఁ గన్గొనినంతఁ జెమ్మటల్
గీలుకొనంగ మేనుబుల
కించ నకించన ధైర్యమై మదిన్

జాలియు బాళిఁ దత్తరము
నానఁగ నానఁగ నానగారి ను
న్స్మిలదపాంగనీల నలి
నీదళరాజినిఁ బూజ చేయుచున్.

ఉ. "దేవ, శచీమనోరమణ,
దేవర వచ్చినదేమి?" "నీదు శో
భావిభవంబుఁ జూడ;" "వన
వాసిని కేమిటి చెల్వు? రత్న"-మే
తావున నున్న నేమి?" "వని
తానవమన్మథ, నాపయిన్ గృపో
ద్భావన నానతిచ్చెదవు;"
"భావజునాన ని జంబుపల్కితిన్."

క. "నామగనివేషభాషల
నేమిటికి ధరించివచ్చి తెలుఁగం జెపుమా"
"నీమగనిరూప మాటకు
పైమాటలు నడపవలదె పంకజగంధీ!"

క. "తగవా యిటువలెఁ బల్కఁగ
మగనాలను నేను భువనమాన్యుఁడ వీవున్

నగరాజదమన, నిన్నుఁ గ
నగరా యిట్లయిన సురలు నగరావళులన్."
క. అని పలికి యళుకుఁ గులుకున్
నునుసిగ్గునురాగరసమునూల్కొనుచూడ్కిన్
గనుఁగొనుచు నవలఁ బోవఁగఁ
జని యడ్డముసొచ్చి పాకశాసనుఁ డనియెన్.
చ. "నిలు నిలు మోలతాంగి, కరు
ణించవె చంపకగంధి, సిగ్గచే
చిలుకలకొల్కి, యంజకవె
చిత్తజుపూవులముల్కి, నీపయిన్
వలచితినే మృగాక్షి, పెర
వాఁడనటే శుకవాణి, యేనికన్
నిలువఁగలేనె చాన, నను
నీదగుబంటుగ నేలవే చెలీ!
శా. నామీఁదన్ దయసేయవే పలుకుపం
తంబేల వే యేలవే
మోమోటం బొకయింతలేక సకి, నీ
మోమైననుం జూపవే

నీమో వించుక నొక్క నీయఁగదవే
నీప్రక్కకుఁ జేర్పవే
యేమైనాపలుకాదరించు వెత నే
నెందాఁక సైరింపుదుఁ."

క. అనుచుఁ బలరిపుఁడంతటఁ
జనవును బలిమియును నెనరుసైఁగలుఁ దోఁపన్
దనకరముల వనితామణి
చనుమొనలకు వేగఁ జాచఁ జాన యిటాడెన్.

చ. "సరసము చేయరాకు ననుఁ
జన్నులపైఁ జెయి వేయఁబోకు ని
ల్వరమని నల్వురున్ వినుకు
లన్ గడునిందలు గట్టి యెందుకున్
వెలవకయాడుకొందు రవి
వేకమునన్ వల దేల వాదు ని
ర్జరపతి! చాలుఁజాలు ముని
రాజు వినన్ మఱి మోసమయ్యెడున్."

చ. "మునిపతి కోపగించినను
మోసమటంటివి మోసమేలనో

వనిత, యతండు నిక్కపటి
    వాహిని, కేఁగెను దానమాడ నీ
మనసుకరంగఁ గావలెను
    మక్కువతో ననుఁ గౌఁగిలించి నీ
ఘనగళశబ్దమంత్రములఁ
    గాయజ భూతముఁ దోలఁగావలెఁ.

ఉ. దూరపుఁగొండలుఁ నునుపు
    దోఁచునటన్నది నిక్కమాయె నో
వారిజగంధి, నీమనసు
    వచ్చునటంచని వచ్చినాఁడ ని
స్సారము చేయఁగాఁ దగదు
    చక్కన గా దిది లేనిపోని యీ
బీరములేల నాదుమన
    విఁ వినవే ఘనవేణికామణీ!

* * * *

చ. సతతము నీగుణంబులను
    జక్కఁడనంబును విందుఁగందు సం
గతిగ.........ము
    ఖంబునఁ గోరిక దీర్తువంచు నే

మతిని దలంచి నీకడకు
మానిని, వచ్చితి కాదటంటివా
యతనుని యాన నీమగని
యాన మఱిమఱి యాన నాపయిన్
సీ. కొమ్మ, నీ కమ్మని కెమ్మోవి యీయవే
యమృతంబుఁ గ్రోలిన యరుచి దీఱ
కలికి, నీచను గుబ్బకవఁ జేరనీయవే
కనకాద్రిపై నున్న కసటుదీఱ
సుదతి, నీకౌఁగిటఁ గదియింపవే కల్ప
సుమతల్పమున నున్న సొలపు దీఱ
వనిత, నీతొడజగ్గుఁ గనుఁగొన నీయవే
రంభతోనె నసిన రట్టుదీర
మస్తుమీఱిన సురహస్తి మస్తకంబుఁ
గుస్తరించిన మామకహస్తములకు
హాయిగా నీనితంబంబు లంటనియవె
కంటు నామీఁద నేల వాల్గంటి,నీకు."
క. అని చెలిపాదంబులపై
ఘనచింతామణిసురత్న కనక కిరీటం

బును మోపి లేవకుండిన
వనజానన సిగ్గువలపు వడ్డికిఁ బాల్పన్.

క. "దేవుఁడ వేలినసామివి
పోవయ్యా! నీవు నాకు మ్రొక్కఁగఁ దగునా
లేవు"మని గుబ్బచనుమొన
లా విభు నెదసోఁక నెత్తె నంగన ప్రేమన్.

ఉ. ఎత్తినపట్టు వీడక సు
రేంద్రుఁడు తత్కుచకుంభపాళిపై
నత్తమిలన్ దురంత విర
హార్ణవ పూరము నీదునై వడిన్
హత్తి రసాలసాలమున
నల్లెడు మల్లియతీవనై వడిన్
గుత్తపుగుబ్బలాడి చను
గుత్తులఁ దత్తను వొత్తు సొక్కుచున్.

ఉ. అంతటఁ గొంతసేపటికి
నంగన సిబ్బెపు గుబ్బ గ్రుమ్మినన్
స్వాంతము జల్లనంగ బల
శాసనుఁ డాసను మోవియాన నా

క్కింత మొగంబు ద్రిప్పి "పడ
కింటికి రమ్మట కొన్ని సమ్మతుల్
కాంతుఁడ, నీ వొసంగినను
గాని యొడంబడ" నంచుఁ బల్కెఁ జూ.

గీ. చెట్టపట్టుక తనదు పూసెజ్జకడకు
వల్లభునిఁ దోడుకొని పోయి వలపు మెఱయఁ
దొడను దొడఁజేర్చి కూర్చుండి తోయజాక్షి
తోయజాక్షీణ రసధార దొలుకఁ బలికె.

సీ. "మెఱుఁగువాతెఱ నొక్కకుర యెంగిలయ్యెని"
"యమృతాని కెంగిలి యనఁగనేమె"!
"సుద్దిగ నున్నాను వద్దుర మైవ్రాల
"నతివ, బంగారాని కంటుగలదె?"
"గుబ్బచన్ను లనంటకుర యొక్కప్రొద్దురా"
"చెయ్యంటకయగోటఁ జెనకరాదె"
"కొఱికిన మడుపువద్దుర నేడు నోమురా"
"తరుణి, మైనను నీవె కొఱికియీవె"
"వ్రతము కలయిక కారాదు వాదులేల"
"కలయకమె కళలయిక్కువల్ తెలిసి నొక్క

దక్కి దక్కింతు నే నిన్నుఁ దరుణి, యనఁగ''
నిగ్గు మొగమునఁ గళదేర నెలఁతయనియె.

సీ. ''నేను నీచెక్కుల నెలవంక లుంతును
నీవు నాచన్నుల నిలుపరాదు
నేను నీ కెమ్మోవి నెఱిగంటుసేయుదు
నీవు నామోవి కందించరాదు
నేను నీకురు లెల్ల నెఱిఁ జిక్కువఱుపుదు
నీవు నాకొప్పుఁబట్టీడ్వరాదు
నేను నీగళమున మృగనాభి నలఁదుదు
నీవు నానెమ్మేన నించరాదు
గుటగుటల మీఱిగడిదేఱి కూకిపల్కు
నీవు నేనును బల్కరా దిట్టు లమ్మ
తైన వచ్చెద నీవు రమ్మనినకడకు
వివిధశృంగారరసలోల, విబుధపాల!''

చ. అనుటయు నల్లనవ్వి విబు
ధాధిపుఁ "డట్లనె నౌనుగాక మం"
చన గురికట్టునిల్చునటె
యంగజుకేళి నటంచుఁ జేర్చెన

క్కన నినబోఁడిఁ జన్మొనలఁ
గ్రుమ్మి సురేంద్రుఁడు మోవియానెఁ గం
జనయన చెక్కుఁ గీలెను గ
చాకచిఁ బోరిరి వార లిర్వురున్.

వ. ఇట్లు మదనకద నారంభ సముజ్జృంభమాణ మనోభిలాషల నయ్యహల్యా సుందరీ పురందరు లమందా నందకర చందనాది కస్తూరికా పరిమళ ద్రవ్యంబులకు సొమ్మసిల్లియుండి రప్పు డమ్మందయాన బృందారక బృందవందిత పదారవిందుండగు నాసంక్రందనునిం గలయు మోహావేశంబునం బట్టరానిగుట్టునం జిట్టాడుచు మట్టుమీఱి యతండు కౌఁగిటం జేర్పనీయక యబ్బురంపు గబ్బి సిబ్బెంపుగుబ్బల నిబ్బరంబునన్ జెయిసోఁకిన సోఁకనీయక కటికి చీఁకటికప్పులన్ గుప్పునన్ గప్పుకొప్పునిమిరిన్ నిమురనీయక మిక్కిలి మెక్కువమైన చక్కని చెక్కుగీటినం గీటనీయక మధుర సుధారస ధారాధురంధరంబైన బింబాధరంబు

గ్రోలినం గ్రోలనీయక కుందనపుటదంపుగెంపైన పూవునుం గుంటుపఱుచు...............

............నంటిన నంటనీయక మెండొడ్డుకొని యేమఱించి యొయ్యనొయ్యన విరుల శయ్యకుఁ జేర్చి లాలించి కౌఁగిలించి యదలించి బాహాబాహిఁ గచాకచిం బెనంగి యల్లందులకుం గమకించి............... చివురు సవురు జవురు మోవితేనెలఁ గ్రోలిపైకొని కోకిలచందంబున శ్రవణానందంబుగా గుట గుటం బలుకుచు మేలు, బళీ, హాసు, శాబాసని మెచ్చి యొకరొకరిమేను లప్పళించి వింతవింత పిలుపులం బిలుచుచుఁ గెందామర లంబోలు కందామరల నరమోడ్పులు గావించుచు మన్మథబ్రహ్మానందంబునుం బొంది మఱియును.

శా. "శౌనే ముద్దులగుమ్మ, చూచితవునే
యందంపుఁబూరెమ్మ, మే

తానే చక్కఁదనాలయిక్క, యదేమే
    లజ్జాస్తుతిచేథక్క, యా
దానే యింతులమేలుబంతి, భళి శి
    ష్టానే కళల్ దొంతి, మి
న్నానే యంచు మఱిఁ బురందరుఁ డహ
    ల్యాభామ నీక్షించుచున్.

సీ. ఎన్నఁడు నేర్చితే యింతులమేల్బంతి,
    పారావతారావపాటవంబు
మెపు డభ్యసించితే యిందుబింబానన,
    వివిధచుంబనకళావిభ్రమంబు
మెచ్చోట నేర్చితే ఏణీవిలోచన,
    నఖరాంకవిన్యాసనైపుణంబు
మేనాఁ డెఱింగితే చీనిచక్కెరబొమ్మ,
    పంచబాణాహవప్రౌఢిమంబు
మూలనున్నట్టి జడదారిముద్దరాల
వెన్నిచిన్నెలు నేర్చితే మెమ్మెలాడి,
మేలు మే"లసి కాంతుఁడు మెచ్చి పొగడ
వింతవింతఁగ మఱియును సంతసమున.

సీ. వెనుదీయకుమటంచు వెడవిల్తుఁ డాడించు
జాటిపోలికఁ గీలుజడ చలింప
స్మరసంగరంబునఁ గురియు పూవులవాన
తెఱఁగున సరులముత్తెములు రాల
మరుఁడను జగజెట్టి బిరుదుపీఁకెలమాడ్కి
గళరవంబున జమత్కార మెసఁగఁ
జిత్తజరాజ్యాభిషేకాంబువుల మాడ్కి
జల్లుగాఁ జెమట చిత్తళ్లు గురియ
మదన పరదేవతాధ్యానమహితనిష్ఠఁ
బోలి యఱమోడ్పుఁగనుదోయి పొలుపు మీఱ
నంబుజేక్షణ .........
నెలమి నమరావతీంద్రు దేవేంద్రుఁగూడి.

వ. అప్పుడు,

ఉ. భావము లొక్కటయ్యెను బ్ర
పంచ మొకించుక తోఁచదాయె నే
నీ వనుభేదముల్ జనె య
నిర్వచనీయ మఖండ మాత్మసా

ష్ట్యావిదితంబు నద్వయ మ
నంతమునౌ సుఖ ముప్పతిల్లె నిం
దీవరగంధికిన్ బతికి
నిర్భర... మొంది పొందుచోన్.

సీ. చంద్రమండల సుధాసారమూరినయట్లు
చెమటచే నెమ్మోము చెలువుమీఱ!
అంకుశక్షత మదహస్తి కుంభములన
గోటిపోటులఁ జిన్నిగుబ్బ లెసఁగ
మగతేఁటి వ్రాలిన మంకెన విరిలీలఁ
గావిమోవిని బంటికాటు దనర
గాలికిఁ గదలెడు కదళిక రీతిగా
గడగడమని తొడల్ వడఁకుచుండ
జాళువాగట్టుమీఁదను వ్రాలినట్టి
నీలమేఘుంబు చొప్పున నెరులు కటిని
వ్రాల ...... లేచి లీల నిలిచె
నింపున నహల్య యవ్వేళ నింద్రు దెసను.

ఉ. వేకువజాము దోఁచె నళి
బృందగరుద్భవవాతసంహతి

స్తోకదళద్దళత్ స్ఫురిత
తోయరుహప్రసరన్మరందధా
రాకలితోదకద్విగుణి
తాంచదభంగతరంగభంగి ప
ద్మాకరశీకరాంతరవి
హారముదారసమీర మంతటన్.

సీ. మరుసాముకంటెముల్ గిరికొన్నతొడలతోఁ
దడబాటు చెందిన నడలతోడ
........ జిక్కులు వడ్డ సరులతో
నెరికొప్పునను జాఱు విరులతోడ
గజిబిజిపలుగంటిగమి కావిమోవితో
నెజీదప్పి వదలిన నీవితోడఁ
గెంపారు నెలవంకగుంపులచెక్కుతో
సొగకన్నుల నిద్రసొక్కుతోడ
మిగులఁ జెదరినయలకల మెయిపులకల
కెలఁకు లరయుచుఁ జిలుకలకొలికి యపుడు
దురుసునడలను గేళిమందిరము వెడలె.
నలరువిలుకాని మదహస్తి యానననంగ.

చ. వెలువడి యింతటంతటను
వేగిరపాటున నొంటిపాటునన్
గలయఁగఁ జూచి చూచి శచి
కాంతుని మెల్ల నహల్యపిల్చి బల్
మెలఁకువతోడ నర్తన బనుప
"మీఁదటి బుద్ధి యిఁకేమి పల్కితే
వెలఁదిరో, పోయివత్తునట
వే దిటవే" యని యింద్రుఁ డిట్లనెన్.

మ. "తరుణీ, యేమని పల్కుదున్ గమనవా
ర్తల్ పల్కనోరాడదే
మఱి కాదంచని యెంచి పోదునన రా
మా, నేఁడు కాళ్ళాడదే
సరసన్ నిల్చినవచ్చునీపతి యథే
చ్ఛన్ నిల్వఁగాఁ గూడదే
కలవారెన్నగదె ముచ్చటల్ మనకు రా
కల్ పోక లింకేడవే.

ఉ. నీవును నేను నొక్కయెడ
నెమ్మది నెమ్మదిగూఁడి యుండుటల్

భావమునందు నైఁ పకను
  పాపపుదైవత మిట్లుచేసె నే
నేవహిం దాళఁజాలు దీక
  నెన్నఁడు మర్వకుమీ ననుం దయా
భావనచేత" నంచు సుర
  వర్యుఁడు వల్కిన కల్కి ప్రీతిగన్.

సీ. "మోహనాకార, నీ మోముఁ జూచినఁజాలుఁ
  సొబగైన చందురుఁ జూడ నేల?
మదనావతార, నీ పెదవియానినఁ జాలుఁ
  గండచక్కెరపానకం బదేల?
సరస, నీ నెమ్మేనిచాయ సోఁకినఁజాలుఁ
  గనకాభిషేకంబు కాంక్ష లేల?
శృంగారమూర్తి, నీ చెట్టఁబట్టినఁజాలు
  నరిదితామరఁ గేల నంట నేల?
కళల నను జాల మెప్పించి కౌఁగిలించి
నీవి వదలించి కదియించి నేర్పు మించి
రతులఁ దేలించి మదనసామ్రాజ్యమేలు
నేలికను నిన్ను నెడబాయఁజాల" ననుచు.

చ. సరసిజపాళిఁ దుమ్మెదలు
చాలుగ నిల్చినరీతి దేవరాట్
కరకమలంబులన్ దనదు
కన్నులఁ గాటుకరేక దాకఁగా
హరు వమరంగ నొత్తుకొని
యంగన కన్నుల నీరునించి "యీ
విరహము నెట్లుద్రోతుఁ గద
వే యెడబాయుట" లంచుఁ బల్కఁగన్.

చ. "కలకంఠీమణి, పోయివచ్చెదఁ గటా
క్షం బుంచు నామీఁద ని
న్నెలమిన్ నమ్మినవాఁడ"నంచు సురరా
జిట్లాడినన్ మందహా
సలసద్వక్త్రిము వాడఁ బ్రోడ మదిలో
సంతాపమున్ గూడఁ జం
చలమై ధైర్యము వీడ నింద్రుఁ గని వాం
ఛాలోలితస్వాంతమై.

ఉ. "నమ్మినదాన, నాతనువు
నమ్మినదానను నీకు; నింక నే

నమ్మకచెల్ల, నన్ను విర
హాగ్నికిఁ బాల్పడఁజేసి పోవుటల్
సమ్మతమాయెనా, విడువఁ
జాలితివా, యెటులైన నిన్ను నేఁ
బొమ్మనఁజాలఁ, జాలినను
బొందినిఁ బ్రాణము లుండ నేర్చునే."

చ. అని యిటుపల్కి పల్కి బిగి
యారఁగఁ గౌఁగిటఁ జేర్చి చేర్చి గ్ర
క్కున మధురాధరంబుచవిఁ
గ్రోలుచుఁ గ్రోలుచుఁ బాకశాసనుఁ
బనుప నతండు మెల్లఁగను
బ్రక్కలు చూచుచుఁ బోవుచుండఁగా
మునివరుఁడైనగౌతముని
ముందఱ నింద్రుఁడు గానఁగాఁ దగెన్.

ఉ. కంటికి నిద్రసోక్క మయిఁ
గాఁడిన గాజులనొక్కు మోవిపై
నంటిన పంటిరక్కు సొగ
సైనసిగన్ బలుచిక్కు గోటిచే

గెంటినముద్దుచెక్కు రహిఁ
గీల్కొనియుండినవానిఁగా మదిఁ
గంటున గౌతముండు తెర
గంటిదొరం గని యాగ్రహంబునన్.

ఉ. చండకరాభుఁడైన ముని
చంద్రుఁడు కోపముతోడ "నోరి, యా
ఖండల, కండగర్వమునఁ
గన్గొనలేక మదీయకాంత ను
ద్దండత నాదువేషమునఁ
దద్దయుఁ బొందితి వట్లుగాన నీ
వండవిహీనుఁడై తిరుగు"
మంచని మించి శపించె నెంచకన్.

చ. ఇటు శపియించి గౌతము ము
నీంద్రుఁడు వేగ నిజాశ్రమస్థలిన్
గిటుకునఁ జేరి కోప మెదఁ
గీల్కొన భార్యను బిల్వ నంతలో
దిటవెడలంగ నంగన మ
దిన్ దడబాటు చెలంగ మానిచెం.

గట వినయంబుతో నిలిచెఁ
గాళ్లకు నీళ్లను గొంచు గొబ్బునన్.

ఉ. ఆతటి నాలతాంగిని మ
హోగ్రహదృష్టిని జూచి "యోసి, నీ
చేతిజలంబు లంటనిఁకఁ
జెల్లునె యెంతటి జంతవే బలా
రాతిని గోరి కూడితివి
రాతిరి జామునఁ గావునన్ బలా
రాతిశరీర మందు"మని
రాజముఖిన్ సునఖిన్ శపింపఁగన్.

క. గడగడ వడఁకుచుఁ దడఁబడి
పడఁతుక జడదారిచరణ పంకజములపైఁ
బడి "శాప మెపుడుఁగడతున్ [నియ్యన్.
నుడువు"మనన్ బలికెఁ గరుణ నూల్కొనము

సీ. "బలుపైన రావణప్రముఖుల సమయింప
హరిజగద్విఖ్యాతి నతిశయించి
చెలువుగా దశరథక్షితిభర్తకుదయించి
రామనామఖ్యాతి రహిని మించి

మునిమాట విని తాటకిని గీటణంగించి
యతని యాగము గాచి యతిశయించి
చతురుఁడై జనకరాజతనూజను వరించి
మహితకీర్తులుగాంచి విహితమెంచి
మౌనివరుతోడ నిప్పనమార్గమునను
వరుస నీకమీఁద రాఁగలవాఁ డతండు
నిజ పదసరోజరేణుల నీదుశాప [బలికె.
మోచనము సేయఁగలఁ"డంచు మునియుఁ

ఉ. అంతట నమ్మహాత్ముఁడు ని
జాశ్రమవాటిఁ బరిత్యజించి దు
ర్దాంతదురంతకేసరి వి
తానమహోగ్రవరాహవాహజి
ద్దంతురదంతివన్నగముఁ
దాపసబంధితవల్కశాటికా
త్యంతవిలాసభృన్నగము
నౌ హిమవన్నగ 'మొందె నమ్మౌర్ల్య.

వ. అంతఁ గొంతకాలంబునకు నిక్ష్వాకువంశవయః
పారావార రాకాచంద్రుండగు దశరథమహా

రాజేంద్రునకు దేదీప్యమాన మార్తాండమండల
సమథాముండును వైరికాంతార ప్రళయకాల
దావానల ప్రభాసముద్దాముండును అనంత
కళ్యాణగుణాభిరాముండును నై శ్రీరాముండు
విష్ణుమూర్తి పూర్ణావతారంబున జనియించి
దినదిన ప్రవర్ధమానుండై యుండునవసరంబునఁ
దనుప్రభావిజితమిత్రుండగు విశ్వామిత్రుండు
చనుదెంచి దశరథానుమతంబున విమత
ఖండనశౌండ భుజదండ సంపాదిత కీర్తి
సాంద్రుండైన శ్రీరామచంద్రుని సకలాఘౌఘని
వారణసుముఖంబగు మఖంబుఁ గాచుటకై
తోడ్కొనిపోవ నమ్మహావీరుండు సింహశరభ
శార్దూల ప్రముఖ నానావిధ మృగయూథశర
ణ్యంబగు నరణ్యంబుఁ బ్రవేశించి బహువిధ
కామరూపనిరాఘాటసంచారిత శృంగాటక
యగు తాటకఁ వధియించి నీచులగు సుబా
హుమారీచుల నుక్కడంగించి యమ్మౌని
యాగంబుఁ గాచి నిరంతర ప్రబోధధానియగు

జనకరాజ రాజధానింగుఱించి వచ్చునప్పుడు
పురోభాగంబున విజ్ఞాన సూర్య ప్రభానిరస్త
తముని గౌతముని యాశ్రమంబుఁ గనుంగొని.

చ. "మునివర, ఏమి యీవనము
ముచ్చటగాఁ దగియుండియుఁన్ వృథా
జనకులహీనమై యిరిణ
సన్నిభమై కనుపట్టె నేమకో
వినిమెద" నంచు వేఁడు రఘు
వీరునికిన్ గుశికాత్మజుండు ప
ల్కెను మది సంతసం బలర
లీలఁ దదాశ్రమ వర్తమానముల్.

ఉ. "భూతలమందు మౌనికుల
ముఖ్యుఁడు గౌతముఁ డంచనన్ దపః
ఖ్యాతిని దీటులేదన జ
గత్త్రియమందుఁ బ్రసిద్ధినందు న
య్యాతనియాశ్రమం బిది మ
హా శ్రమవారణకారణంబు రా
చూతువుకాని యందు నొక
చోద్యముహృద్య" మటంచుఁ బల్కుచున్.

క. ఆరాముని గౌతమముని
యారామస్థానవాటికై పిల్చు కహ
ల్యారామశాపహృతికై
యారామగతిఁ మునీంద్రుఁ డచ్చటి కేఁగెన్.

క. అందందుఁ జూచుకొనుచును
ముందఱ రఘురాముఁ డపుడు పోవుచునుండన్
కెందమ్మిఁ బోలుపాదము
లందలి రేణువులు తాఁకి నందినయంతన్.

మ. మృదువై మెల్లన కొంతసేపటికి స
ద్వృత్తంబుగా నౌచుఁ బెం
పొదవన్ గొంత కరంగి సోఁగయగుచున్
బొల్పొంది యారాయి చ
క్కఁదనం బేర్పడి మోహనాకృతి చెలం
గన్ యావనశ్రీతగన్
సుదతీరత్నముగాఁగ నిల్చెను మదిన్
జోద్యంబు వాటిల్లఁగన్.

చ. వినయముగాను మౌనియలి
నేణియుదారపదారవిందముల్

కనుఁగొనుచుఁ రఘూద్వహుఁడు
క్రక్కునఁ దాను నమస్కరించె నా
వనిత యొసంగు దీవనల
వల్లను నుల్లము పల్లవింపఁగా
మునిమునిమీసముల్ కులుకు
మోమున నవ్వు దొలంకుచుండఁగన్.

క. ఆతఁడు గనుఁగొని బిరబిర
గౌతమముని యేఁగుదెంచి గౌరవమొప్పన్
నాతిసమీపముఁ జేరిన
యాతనిఁ గని రామచంద్రుఁ డానందమునన్.

చ. ముదము మదిన్ బొసంగ "ముని
పుంగవ, రాముఁడ నే" నటంచుఁ ద
త్పదయుగపాళికిన్ దనదు
ఫాలము సోఁక నమస్కరించి యిం
పొదవఁగఁ జెంతఁజేరిన ర
ఘూద్వహునిన్ ముని యాదరించి సం
పద లిగురొత్తఁ గౌశికుని
పట్టు కనుంగొని పల్కెఁ బ్రేమతోన్.

సీ. "జంభారిమణి వృత్తసంభారదోస్తంభ
భూషణుం డకలంకభాషణుండు
భాషాపతి మహామనీషావిశేషార్థ
ధారణుం డాప్తసాధారణుండు
చండభానురుచి ప్రచండకాండనిరస్త
తాటకుం డఖిలలోకాటకుండు
అధ్యాత్మవిద్యానిదిధ్యాసవిధ్యాత్మ
భావనుం డఖిలైకపావనుండు
భద్రనిర్నిద్రుఁడగు రామభద్రుఁ డస్మ
దీయభద్రేభయానను దీనశరణ
చరణసరసిజరేణులఁ బరమకరుణ
శాప మెడలింపఁ గంటివా తాపసేంద్ర!"

క. అనిపలుకుచు గౌతమముని
తనచెంత మెలంగు రామధరణీశ్వరుతో
మనమున సంతసమందుచు
ననియెను సమ్మతముగాఁగ నపు డందఱికిన్.

సీ. "బహుజన్మకర్మసంభవపాపజలరాశి
మరుభూమితలముగా మెఱయఁజేయు

సజ్ఞానపటలఘోరాగాధకూపంబు
నెడలేక పూడ్చి యేర్పడఁగఁ జేయు
నమితదుర్మోహకృత్రిమరత్నదీధితుల్
మరలనీయక క్రమ్మి మరుఁగుచేయు
నప్రాప్తితాపకృత్ర్యసన దిక్కోణంబు ?
తెలియకుండువిధంబుఁ గలుగఁజేయు
నబ్జసంభవముఖ నిఖిలామరాళి
మస్తకకిరీటవిన్యస్త మణిగణఘృణి
ఘటితభవదీయచరణ పంకజపరాగ
రాజి వర్ణింప నెవరితరంబు రామ!

ఉ. ఖ్యాతిని నీదుపాదకమ
లాంచితరేణురజంబుఁ దాల్ప ని
శ్చేతనమైన ఱాతి కొక
చేతన మబ్బె నటన్న నట్టిచోఁ
జేతనవృత్తినున్నసుర
సిద్ధులు సాధ్యులు మౌళిఁ దాల్చి యే
రీతిగ నుందురో తెలియ
రెవ్వరు రామ, భవత్పదంబులన్."

క. ఇటు కొనియాడుచు నుండిన
జటిలుని వీడ్కొనుచు రామచంద్రుఁడు మిథిలా
పుటభేదనమున కేఁగెను
తటకాపడి కౌశికుండు తనతో రాఁగన్.

ఉ. అంతటఁ బ్రేమ గౌతముఁ డ
హల్యయు నుల్లము లుల్లసిల్లఁగాఁ
జంతలు దీఱ నొండొరులుఁ
జిత్తజు కేళికళావిలాసముల్
వింతలుగా ఘటించుచును
వేడుకతోఁ దుతఁ గూడియుండి యిం
తంతనరాని సౌఖ్యముల
నందిరి ముచ్చటమీఱ నెప్పుడున్

క. ఈకథఁ జదివిన వినినన్
బ్రాకటముగ వ్రాయఁగనిన బహుసంపదలన్
గైకొను మనుజుల్ వారికి
శ్రీకరుఁడగు రంగవిభుఁడు ప్రేమ నొసంగున్.

శా. కస్తూరీతిలకోజ్జ్వలస్మితముఖా
కైవల్యలక్ష్మీసఖా
హస్తోదంచిత శంఖచక్రరుచిరా
హస్తీంద్రరక్షాపరా
అస్త్రకామృతవర్షి వేణునినదా
యానందలీలాస్పదా
త్రస్తాస్తోకజనాభయప్రదకరా
ధారాధరశ్రీకరా!

క. సారఘనసారనవకా
శ్మీరపటీరాంగరాగశీతలతటరా
ధారమణీకుచదుర్గయు
గారోహవిహారలీల యదుకులబాలా!

మా లి ని

దళితవిపులమాయా ద్రావిడామ్నాయగేయా
జలరుహదళనేత్రా సవ్యసాచీష్టమిత్రా
బలివిభవవిరామా భానువంశాబ్ధిసోమా
కలశజలధిశాయీ కామితార్థప్రదాయీ!

## గ ద్య .

ఇది శ్రీమత్పాండ్యమండలాధీశ్వర శ్రీ విజయరంగ
చొక్కనాథమహీనాథ కరుణాకటాక్ష సంపా
దిత గజతురంగమాందోళికా ఛత్రచామర
విజయకాహళ భూరిభేరీబిరుదధ్వజ
ప్రముఖ నిఖిలసంపత్పారంపరీ సమేధ
మాన సముఖమీనాక్షినాయక
తనూభవ శ్రీమీనాక్షీ దేవీ
కటాక్షలబ్ధకవితాసాంప్రదా
యక వేంకట కృష్ణప్పనా
యక ప్రణీతంబైన య
హాల్యాసంక్రందనం
బను మహా ప్ర
బంధంబునం
దుః దృతీ
యాశ్వా
సము.

---

స ం పూ ర్ణ ము

---

